# ఈ 'కాలం' కథలు

(మినీ కథల సంకలనం)

Acc No - 23054

398/1774

వేదగిరి రాంబాబు

1112/ROP

శ్రీ వేదగిరి కమ్యూనికేషన్స్
1-8-481, II అంతస్తు
శ్రీ వెంకటేశ్వరస్వామిగుడి వీధి
హైదరాబాద్ - 500020
ఫోన్ : 661665.

EE'KALAM' KADHALU - Mini stories
Compilation By Vedagiri Rambabu

First Edition : February 1994

PRICE : Rs10/-

Cover page and inside illustrations
ANAND A.V.B.S.

C 81331
894.
RAM

Cove page printed at :

Gayatri Printers
Near New M.L.A. Quarters,
Basheerbag, Hyderabad.

Printed at :

Padmavathi Art Printers
1-1 517/B/1, New Bakaram,
Gandhinagar, Hyderabad-380
Phones : 611413, 600547.

# కృతజ్ఞతలు

రచయితగా పెరగడానికి నాకెంతో ప్రోత్సాహాన్ని అందించిన నాటి ఆంధ్ర సచిత్ర వారపత్రిక సంపాదకులు, శ్రేయోభిలాషులు **వీరాజీ** గారికి కృతజ్ఞతల్తో ఈ మినీ కథల మినీ పుస్తకాన్ని అంకితమిస్తున్నాను.

—వేదగిరి రాంబాబు

13-2-94

# ఈ పుస్తకంలో

పేజి



# అదృష్టం

కళ్ళు మిరుమిట్లు గొలిపే యుద్ధాలున్నాయనడంతో మొదటి రోజే ఆ సినిమా చూడాలనుకున్నాడు సింహాచలం.

సినిమా థియేటర్ చేరుకునేసరికి అతని చొక్కా చెమటతో తడిసి పోయింది. నోరు తడారిపోతోంది. అప్రయత్నంగా అతని కాళ్ళు థియేటర్ బయట రోడ్డు ప్రక్కన నిలిచివున్న ఓ చెరుకుబండి వైపు కదిలాయి.

చెరుకు రసం త్రాగుతున్న అతని దృష్టిని ఆకర్షించింది దూరంగా వున్న ఓ బార్.

'ఆ ఎయిర్ కండిషన్డ్ బార్‌లో కూర్చుని చల్లటి బీర్‌ని సేవిస్తున్న వాళ్ళు ఎంత అదృష్టవంతులో కదా!' అనుకున్నాడు.

అప్పుడు ఆ ఎయిర్ కండిషన్డ్ బార్‌లో కూర్చుని చల్లటి బీర్ త్రాగుతున్న బాబూరావు- 'ఇలా బార్‌ల వెంట బీర్‌ల కోసం తిరక్కుండా ఇంట్లోనేవుండి ఏది కావాలంటే దాన్ని ఫ్యాన్‌ల ద్వారా తెప్పించుకునే మా బాస్‌లాంటి వాళ్ళు ఎంత అదృష్టవంతులో కదా!' అనుకుంటున్నాడు.

ఆ బార్‌కి బారెడు దూరంలోని బంగళాలో బీరు పట్టిస్తున్న బాస్ ఎదురుగా కిటికీలోంచి కనిపిస్తున్న పెద్ద సినిమా కటవుట్‌ని చూసి కొద్దిగా చలించాడు. 'నాలుగ్గంతులు వేసి లక్షలకు లక్షలు సంపాదిస్తున్న వాళ్ళు అదృష్టవంతులు. తను ఎన్నాళ్ళు సర్వీస్ చేసినా వాళ్ళు సంపాదించినట్లు సంపాదించలేడుగా!' తనలో తనే గొణుక్కున్నాడు బాస్.

సరిగ్గా ఆ కటవుట్‌లోవున్న హీరోగారి కారు అప్పుడే ఆ థియేటర్ దగ్గరకు వచ్చి ఆగింది. నలుగురు మధ్యా కూర్చుని సరదాగా తన సినిమాని చూసి ఎంజాయ్ చెయ్యాలని భార్యతో సహా వచ్చాడతను. ప్రేక్షకులు తమ అభిమాన హీరోని చూసారు. వెల్లువలా విరుచుకుపడ్డారు.

అతికష్టంమీద చావుతప్పి కన్నులొట్టబోయినట్లు వాళ్ళ బారి నుంచి తప్పించుకుని తన కారుని ముందుకురికించాడు హీరో.

అప్పుడే చెరుకు రసం త్రాగి థియేటర్ వైపు వెళ్తున్న సింహాచలాన్ని చూసి 'పూర్తి స్వాతంత్ర్యంతో తనెలా చెయ్యాలనుకుంటే అలా చేయగల ఇతనెంత అదృష్టవంతుడో కదా!' అనుకున్నాడు హీరో కారు స్పీడుని పెంచుతూ.

(స్వాతి సపరివార పత్రిక)

# ఆకలి

**కొంతి** అంతా అక్కడ కుప్పబోసినట్లుంది.

ఫంక్షన్ ప్యాలెస్ రంగురంగుల బట్టలతో కళకళలాడిపోతోంది.

అటుగా పోతున్న అతను ఆ ఫంక్షన్ ప్యాలెస్‌లోని హడావిడికి ఆకర్షితుడై, అక్కడే నిలబడి ప్యాలస్ వైపు చూడడం సభ్యత కాదని పించిందేమో-ప్రక్కనేవున్న మిర్చిబండి వేపు వెళ్ళాడు. చేతిలోకి మిర్చి ప్లేటు చేరినా చూపులు మాత్రం ప్యాలస్ వేపే వున్నాయి. అందని ద్రాక్ష కోసం అర్రులు చాస్తున్నట్లున్నాయి అతని ఆ ఆకలిగొన్న చూపులు.

అతనికి కొద్దిగా ఇవతల చెత్తకుండీ ప్రక్కన గోడకి ఆనుకుని ఫుట్‌పాత్‌మీద కూలబడున్న ఓ బిచ్చగాడి చూపులు అతని మిర్చి ప్లేటులో చిక్కుకుపోయివున్నాయి. ఆ చూపుల్లోని ఆకలి అతను తిండి తిని ఎన్నాళ్ళయిందో అనిపించేట్లు చేయకమానదు ఎవరికైనా!

సరిగ్గా అప్పుడే ఓ మోటార్‌సైకిల్ దూసుకొచ్చింది ఫంక్షన్ ప్యాలెస్‌లోకి. దాని వెనుక కూర్చున్న ఆ అందాల రాసిని చూడగానే సభ్యతని కూడా మరచిపోయి, తినడాన్ని కాసేపు వాయిదా వేసి, ఆమెనే ఆకలిగా చూడసాగాడు మిర్చి తింటున్న అతను. ఆ చూపుల్లోని ఆకలి అతను ఆడగాలి తగిలితేనే ఎంతగా చలించిపోతాడో చెప్పకనే చెబుతోంది.

మోటార్‌సైకిల్ని స్టాండు వేసికూడా ముందుకు అడుగు వేయడం మరచి, ప్రక్కనే నిలబడున్న భార్య వునికిని వదలి, అవతల ఆగివున్న

కారు వంక ఆకలిగా చూడసాగాడు ఆ యువకుడు. ఓ పదిమంది తనని సాగనంపడానికి రాగా, డ్రయివర్ కారు తలుపులు తెరవగానే వెనక సీట్లో వెనక్కి జారిగిలబడి కూర్చున్నాడు ఆ పెద్దమనిషి. ఇంకా అలానే కారుని, కారులోని పెద్దమనిషిని చూస్తున్న మోటార్ సైకిల్ యువకుని చూపుల్లో ఆకలి - జీవితంలో ఎప్పుడైనా తనాస్థితికి చేరుకోగలడా అని తపన పడుతున్నట్లు వుంది.

గేటులోంచి బయటికి దూసుకుపోతున్న కారులోని పెద్దమనిషి చూపుల్ని ఫుట్ పాత్ మీద కూర్చున్న బిచ్చగాడు ఆకర్షించాడు. 'తనకి తినడానికి ఎంతవున్నా అరిగించుకునే ఆరోగ్యం లేదు. కనీసం ఇలాంటి ఫంక్షన్లకి వచ్చినప్పుడన్నా నలుగురితోపాటు సరదాగా ఏమీ తినలేడు. అందుకే ఆ బిచ్చగాడి కళ్ళలోని ఆకలి తనని అంతగా ఆకర్షిస్తోంది' బిచ్చగాడిని చూసి ముచ్చటపడుతూ అనుకున్నాడు పెద్దమనిషి.

(స్వాతి సపరివారపత్రిక)

# ఇబ్బంది

కిరాతకుడిలా పదిన్నరకే మండిపోతున్న ఎండమీద చిరాకుపడ్డాడు రామకృష్ణ. ప్రక్కనే నిలబడివున్న అందమైన యువతి అతనికి ఆనందాన్ని కలిగించడంలేదు మరింత ఇబ్బంది పెడుతోంది. ఆడవాళ్ళు కూడా ఉద్యోగాలు సంపాదించి, అలా ఆనందంగా తిరుగుతుంటే, ఇంకా ఉద్యోగాల వేటలోవున్న తనమీద తనకే చిరాకువేస్తోందతనికి. అందుకే ఇబ్బందిగా నిలబడి, 'బస్సు ఎంత త్వరగా వస్తుందా, తనని ఇంటర్వ్యూ జరిగే ఆఫీసు దగ్గరకు ఎంత త్వరగా చేరుస్తుందా' అని ఆత్రుతపడ సాగాడు.

బస్‌కోసం ఎదురుచూస్తున్న రుక్మిణికింతకన్నా ఎక్కువ ఇబ్బందిగా వుంది, అక్కడ నిలబడడం! సీతదీ తన వయసే! అయినా ఆమెకీ తనకీ ఎంత తేడా?! ప్రొద్దునే తనిలా ఉద్యోగంకోసం పరుగెడుతుంటే, ఆమె అందంగా అలంకరించుకుని, అంతకన్నా ఆనందంగా భర్తతో బయల్దేరిందెక్కడికో!!! ప్రక్కనే నిలబడున్న సీతని చూడలేక సతమతమవుతూ నేలచూపులు చూడసాగింది రుక్మిణి.

భర్తకి అంత సన్నిహితంగా దాదాపు తాకుతున్నట్లుగా అలా నిలబడడం ఇబ్బందిగా వుంది సీతకి. 'పెళ్ళయి మూడు నెలలు కూడా కాలేదు, అందుకే భర్త దగ్గర ఇంకా పూర్తి చనువు ఏర్పడలేదు—తన మనసు విప్పి చెప్పడానికి. తామిద్దర్నీ అందరూ వింతగా చూస్తున్నారేమో!' నెమ్మదిగా తలెత్తి చుట్టూ చూడసాగింది.

ఆమెకి కొద్దిగా ఇవతలగా నిలబడ్డ రాజారావుని ఆ క్రొత్త దంపతుల ఉనికి మరింతగా బాధించసాగింది. అసలే పండక్కి క్రొత్త చీర కొనివ్వలేదని చిర్రుబుర్రులాడుతున్న తనభార్య వీళ్లని చూసిందంటే మరింకే కోరికలతో వేధిస్తుందో! వళ్ళంతా కళ్ళు చేసుకుని వాళ్ళనే గమనిస్తున్న భార్య ప్రవర్తన అతడిని తెగ ఇబ్బంది పెట్టేస్తోంది.

ఆ ఇబ్బందితో అటు ఇటు బిత్తరచూపులు చూస్తున్న రాజారావు చూపులకు రామకృష్ణ అయస్కాంతంలా తగిలాడు. 'పెళ్ళికాని ఇతను ఎంత అదృష్టవంతుడో కదా!' అనుకున్నాడు, ఇబ్బందివల్ల కలిగిన బాధని మరచి.

(స్వాతి సపరివారపత్రిక)

# ఈడు – జోడు

శ్రీ ఇచ్చిన బొమ్మలా వాళ్లు పిలవాలేగాని సాధారణంగా ఏ పెళ్ళి కయినా వెళ్ళిపోవడం నా కలవాటు. ఎందుకసంటే, అక్కడ అందర్నీ కలుసుకోవచ్చు. ఆనందంగా గడపవచ్చు. మా కజిన్స్ పదిమందిదాకా వున్నారు. వాళ్ళందరూ వస్తే చాలు సందడికి.

లత పెళ్ళికి అందరం వెళ్ళాం. అనుకున్నదానికన్నా ఆనందంగా లగ్నం అయిపోయింది. భోజనాలకి టైముండడంతో అందరం వాకిట్లోకి చేరాం. పెళ్ళికి వచ్చిన వాళ్ళందరూ విడిచిన జోళ్ళు అక్కడ కుప్పగా పడివున్నాయి. అన్ని చెప్పుల్ని అలా చూడగానే నాకో చిలిపి ఆలోచన వచ్చింది.

"వురేయ్! ఇంతవరకూ లోలోపల ఈడు కుదిరిన దంపతులని చూసి ఆనందించాం ఇప్పుడు జోళ్ళని చూసి ఆనందిద్దాం. రాఘవా! నీ చెప్పులు బాగా పాతవై పోయినట్లున్నాయిరా! వీటిలో ఏవి కావాలో ఏరుకో" అన్నాను దానకర్ణుడిలా.

"నాకు ఆ బ్రౌన్‌కలర్ చెప్పుల్స్ బావున్నాయి." వెంటనే ఓ జతను సెలెక్ట్ చేసేసుకున్నాడు రాఘవ.

మా గోలలో మేమలా గుమ్మందగ్గర నిలుచుని గొడవ చేస్తుంటే బయటకు వచ్చేవాళ్ళకి అడ్డమేమో అనే విషయం కూడా ఆలోచించలేదు.

పెద్దవాళ్ళయితే ఏదో కుర్రకారులే అని మమ్మల్ని తప్పించుకుని అటో ఇటో వెళ్ళిపోతున్నారు. ఉత్సాహంవున్న కుర్రకారైతే అంతకు ముందు పరిచయం లేకపోయినా మాతో జాయినై పోతున్నారు.

నవ్వులు .. కేరింతలు....

"ప్చ్ .... లాభం లేదు. చెప్పులు బావున్నాయిగాని చిన్నవై పోయాయి." నిట్టూర్చాడు రాఘవ.

"నీకు సరిపోతాయేమో చూడరా వేణూ!''

''బాడ్‌లక్....నాకు పెద్దవయ్యాయి.''

''శ్రీనూ, నీకో....?''

''ప్చ్...."

అలా ఒకళ్ళనొకళ్లు ప్రశ్నించుకుని అక్కడున్న అందరం చూసాం కానీ, ఎవరికీ సరిగ్గా సరిపోలేదు.

అంతవరకూ మాట పలుకూ లేకుండా మా గోలని చూస్తూ, కళ్ళ తోనే ఆనందాన్ని వ్యక్తపరుస్తున్న తన ప్రక్కనున్న వ్యక్తిని పలక రించాడు వేణు - "ఈ జోళ్ళు మీకయినా సరిపోతాయో లేదో చూడండి మాష్టారూ" అంటూ.

అతను వేసుకున్నాడు.

సరిగ్గా సరిపోయాయి.

"మీకు చక్కగా సరిపోయాయి, ఉంచేసుకోండి." ఉచిత సలహా పారేశాడు వేణు.

"ఉంచేసుకోక ఛస్తానా-వందరూపాయలు పెట్టి ఏరి, కోరి కొను క్కున్నవాటిని!'' చిన్నగా నవ్వాడతను.

నిముషంపాటు మా ఎవరినోటా మాటలేదు.

(స్వాతి సపరివారపత్రిక)

# ఉదాత్తుడు!

కుర్చీలో కూలబడిపోయాడు, ఆఫీస్‌నుంచి అలసిపోయి ఇంటికి చేరుకున్న రాజారావ్.

భర్తకి కాఫీ తీసుకొచ్చి అందించింది రమణి.

అతను కాఫీ తాగుతుంటే, అతని కాళ్ళ దగ్గర కూర్చుని బూట్లు విప్పసాగిందామె.

—ఆమె బూట్లని విప్పడం, అతను కాఫీకప్పుని ఖాళీ చెయ్యడం ఒకేసారి జరిగాయి.

కప్పుని కింద పెట్టబోతున్న రాజారావ్‌కి ఎదురు కుర్చీ క్రింద కాల్చి పారేసిన సిగరెట్ ముక్క కనిపించింది.

అంటే — రాజు మళ్ళీ వచ్చాడన్నమాట!

అతని మనసంతా చికాకైపోయింది.

ఎంత మేనత్త కొడుకైతే మాత్రం అంత తరచుగా వచ్చిపోతుండాలా? అదీ తను లేనప్పుడు!

అతనికి బుద్ధిలేకపోతే రమణి బుద్ధేమైంది? 'ఆయన లేనప్పుడు రావడం బావుండదు, వున్నప్పుడే రమ్మ'ని చెప్పవచ్చుగా?

అంత ఒకళ్ళని చూడకుండా మరొకళ్ళు వుండలేనివాళ్ళయితే పెళ్ళి చేసుకోవలసింది!

చటుక్కున కుర్చీలోంచి లేచి చెప్పులు తొడుక్కున్నాడు రాజారావ్.

"అదేమిటండీ! ఇప్పుడేగా వచ్చింది, అప్పుడే ఎక్కడికి బయల్దేరారు....?" అడిగింది రమణ.

జవాబు చెప్పాలనిపించలేదు రాజారావ్‌కి. చరచరా ముందుకు కదిలాడు.

....రోడ్లవెంట ఎంతసేపు తిరిగాడో తెలీదు. కాళ్ళ నొప్పులు పుట్టేసరికి ఎక్కడైనా కాసేపు కూర్చోవాలనిపించింది. నిర్మల గుర్తుకొచ్చింది. కాసేపు వాళ్ళింట్లో కూర్చుంటే మనస్సుకి తృప్తిగా వుంటుంది. బయల్దేరాడు నిర్మల ఇంటివేపు.

తనని చూడగానే ఆమె ముఖంలో అనుకున్నంత ఆనందం కనిపించకపోయేసరికి లోపలికి అడుగు పెట్టడానికే ఇబ్బందిగా అనిపించింది.

''సారీ రాజారావ్ ఇలా అంటున్నానని ఏమనుకోకు. ఆయనలో నీలాంటి ఉదాత్తత లేదు. ఎప్పుడైనా వస్తే, దయచేసి ఆయనున్నప్పుడొస్తే బావుంటుంది....'' చిన్నగా అన్న ఆమె మాటలు అతనికి ఈటెల్లా తాకాయి.

చటుక్కున లేచి బయటికొచ్చేసాడు.

అతడిని ఇబ్బంది పెట్టింది ఆమె మాటలు కాదు- ఇందాక భార్యతో తన ప్రవర్తన గుర్తుకొచ్చి!

(ఈవారం వారపత్రిక)

# ఊరిహ

కూలబడ్డాడు తన రిక్షాలో రాములు.

ఇంకా సినిమా వదలలేదు. వదిలితేనే బేరం తగిలేది. అలా ఇంకా ఎన్నో ఆటోలు, రిక్షాలు ఆ హాలు ముందు పడిగాపులు కాస్తున్నాయి.

తీరిగ్గా బీడీ అంటించిన రాములు మనసులో రకరకాల ఆలోచనలు_

సరిగా వారం రోజుల్లో లక్ష్మి తన జీవితంలోకి ప్రవేశిస్తుంది. ఆమె అదృష్టంతోనయినా తన జీవితం బాగుపడితే బాగుండు!

పెళ్ళికాగానే లక్ష్మితోసాటు తనూ రిక్షాల్లో తిరగాలి. తను తొక్కడు. లక్ష్మి సరసన కూర్చుని ఝామ్మంటూ ప్రయాణం చేస్తాడు.

_అతను ఆలోచనల్తో సతమతమవుతుండగానే సినిమా వదిలారు.

ఆ జనంలో అతని కళ్ళని చటుక్కున్న ఆకర్షించింది ఓ ముచ్చటైన జంట. గబగబా రిక్షాని వాళ్ళవేపు లాక్కుపోయాడు - "రిక్షా కావాలా బాబూ...." అంటూ.

మధ్యలో అడ్డువచ్చి "రిక్షా! వస్తావా?" అన్నవాళ్ళని అసహ్యంగా చూసాడు. ఆనందంగా తన అభిమాన జంటవేపు బండితో దారితీశాడు.

బేరం ఊసెత్తకుండా వాళ్ళ నెక్కించుకుని ముందు కురికించాడు రిక్షాని.

అతని మనసునిండా తియ్యని వూహలే! వాళ్ళిద్దరిలో తనని, లక్ష్మిని చూసుకొంటున్నాడు. వాళ్ళ గుసగుసలు అతనికి గిలిగింతలయ్యాయి. బండికన్నా అతని వూహలు వేగంగా పరుగెత్తుతున్నాయి.

"ఏమ్ రిక్షా.... ఆపు.... "కంగారుగా కేకేసింది రిక్షాలో కూర్చున్నామె.

''మరికొంచెం ముందుకు వెళ్ళిన తర్వాత ఆపుదాంలే....'' రిక్షాలో కూర్చున్నతను గొణిగినట్లున్నాడు.

"వద్దు. ఆ సందు తిరిగితే తెలిసినవాళ్ళెవరైనా చూస్తే బాగుండదు. మా ఆయనకి తెలిసిందంటే - అమ్మో...." ఆమె మాటలు సన్నగా చెవిని పడగానే కళ్ళు గిర్రున తిరిగినట్లనిపించింది రాములుకి. రిక్షా ఆగిపోయింది.

చటుక్కున ఆమె దిగింది.

''వెనక్కి పోనియవోయ్...." రిక్షా దిగకుండానే ఆజ్ఞాపించాడతను.

రాములు వూహ కరిగిపోయింది. ''నేను వెనక్కిరాను బాబూ! మీరూ దిగిపొండి....'' అతనికి తెలీకుండానే అతని నోటవెంట ఆ మాటలు కాస్త కర్కశంగానే వచ్చాయి.

(స్వాతి సపరివారపత్రిక)

# ఎగతాళి

కృపాణధారియైన సైనికుడిలా దూసుకుపోతున్న రామారావు కాళ్ళకి డొంక తీగలా అడ్డం పడ్డాడతను.

"బాబూ! అన్నం తిని రెండు రోజులైంది బాబూ...."

గబగబా వెళ్తున్న రామారావుకి బిచ్చగాడి దయనీయమైన ఆకలి అభ్యర్థన విపరీతమైన చిరాకుని తెప్పించింది.

"జరుగు ప్రక్కకి...." అసహనంగా అరిచాడు.

"బాబూ! ఒక్క పది పైసలు...."

"తప్పుకో...." రామారావు కోపం తారస్థాయికి నందుకుంది.

గొంగళి పురుగుని ఛీదరించుకున్నట్లు అతన్ని ఛీదరించుకుంటూ ముందుకు కదిలాడు.

అతను ఆ సందు చివరికి వచ్చేసరికి దూరంగా వస్తున్న పెద్ద వూరేగింపు కనిపించింది.

అతని కన్నుల్లో ఆనందపు నక్షత్రాలు వెలిగాయి. మనసులో వుత్సాహం పెల్లుబికింది.

బడా సినిమా నటులు కొందరు పేదలకోసం నిధిని సేకరించ డానికి బయల్దేరతీసిన రాలీ అది!

వాళ్ళు జోలెపట్టుకుని రోడ్లవెంట నడుస్తుంటే జనాలు వేలం వెర్రిగా పరుగులెత్తుకుంటూ వెళ్ళిమరీ వాళ్ళకు చందాలు ఇస్తున్నారు.

అంతా కోలాహలం....

ఆ తారల దృష్టిలో ఇతరులకన్నా తాము ఎదగాలనే వుద్దేశంతో ప్రజలు పోటీపడి ఒకళ్ళకన్నా మరొకళ్ళు ఎక్కువగా చందా లిస్తున్నారు.

రామారావు అంతమందిలో నుంచి అభిమన్యుడిలా దూసుకుంటూ తన అభిమాన తార దగ్గరకు వెళ్ళాడు. జేబులో వున్న వాటన్నింటిని తీసి ఆమె జోలెలో వేసాడు. అంతటితో ఆగకుండా చేతినున్న వాచీ కూడా తీసివేశాడు.

ఇవతలికి వచ్చిన అతడిని ఒందాకటి బిచ్చగాడే "బాబూ! ధర్మం" అంటూ అడిగాడు అతడు తనని ఎగతాళి చేస్తున్నట్లనిపించి చెళ్ళున చెంపదెబ్బ కొట్టాడు.

(ఆంధ్రజ్యోతి వారపత్రిక

# ఏవగింపు

కెరటాలు వువ్వెత్తున ఎగిసిపడే సముద్రంలా చాలా ఆనందంగా ఎగిసిపడుతోంది శ్రీనివాసరావు మనసు. తన చిరకాల వాంఛ నెరవేర బోతున్నందుకు, ఇన్నాళ్ళకు తనని చూసి నవ్వేవాళ్ళ నోరు కట్టించే అవ కాశం వచ్చినందుకు!

అన్ని పత్రికలూ అతని రచనల్ని త్రిప్పికొట్టినా ఆకాశవాణి మాత్రం అవకాశమిచ్చి రచయితగా ముద్ర వేయబోతోంది.

ఆఫీసులో అందరికీ పెద్ద ఎత్తున పార్టీ ఇచ్చి సగర్వంగా అనౌన్స్ చేసాడు. కథని విని ఆకాశవాణికి మీ అమూల్య అభిప్రాయాలు రాయమని అభ్యర్థించాడు కూడా! ఊళ్ళో వున్న వాళ్ళందరికీ చెప్పడం కాగానే పొరుగు వూళ్ళ వాళ్ళకి వుత్తరాలూ రాసాడు. అంతటితో పబ్లిసిటీ కార్య క్రమం పూర్తయింది. ఆ రోజు కోసం ఆత్రంగా ఎదురుచూడసాగాడు.

బ్రాడ్‌కాస్టింగ్ తేదీ రానే వచ్చింది.

ప్రసార సమయానికి ఇంటి చుట్టుప్రక్కల వాళ్ళని, ఇంట్లోనివాళ్ళని అందర్నీ అరెస్టు చేసినట్లు రేడియో దగ్గరకు తీసుకొచ్చి పడేసాడు.

కథ ప్రసారమయ్యే టైమైంది.

ఛటుక్కున వాల్యూమ్‌ని పెంచాడు.

చీమ చిటుక్కుమన్నా వినిపించే నిశ్శబ్దం ఒక్క క్షణం-

హఠాత్తుగా రేడియో అరిచింది___

"ప్రకటించిన కార్యక్రమానికి బదులుగా ప్రధానమంత్రి రాష్ట్ర
పర్యటన విశేషాలు...."

ఒక్కసారి అందరూ ఘొల్లుమన్నారు

శ్రీనివాసరావు కోపంతో వూగిపోసాగాడు.

"శ్రీనివాసరావుగారూ! మీ కథ రానట్టేగా.... వస్తాం." ఒక్కొక్క
రేడియో దగ్గరనుంచి కదిలారు.

"పరువు తీశారు కదండీ...." భార్య సన్నాయి నొక్కులత
మరింతగా క్రుంగిపోయాడు శ్రీనివాసరావు.

సరిగ్గా ఈ సంఘటన జరిగిన వారం రోజులకి రేడియో వింటున్న
శ్రీనివాసరావు వులిక్కిపడ్డాడు.

"మేము ప్రసారం చేసే కార్యక్రమాల్ని శ్రద్ధగా విని తమ అ
ప్రాయాల్ని రాస్తున్న శ్రోతలకి ముందుగా మా ధన్యవాదాలు. గతవార
ప్రసారమైన శ్రీనివాసరావుగారి 'ఏవగింపు' కథ మాకు నచ్చిందంటూ
మా కార్యాలయానికి అసంఖ్యాకంగా వుత్తరాలు వచ్చా"యంటూ పేర్ల
చదువుతున్నారు.

భార్య ఎక్కడ వింటుందోననే భయంతో చటుక్కున కట్టేశాడు
ఆ పేర్లన్నీ తను కథమీద అభిప్రాయం రాయమని కోరిన మిత్రులవే
పార్టీ తీసుకున్నామన్న మొహమాటంతో వినకుండా వుత్తరం రాసిపడేసార
మహానుభావులు! అప్పుడు శ్రీనివాసరావుకి ఏవగింపు కలిగింది—రేడియో
మీద, మిత్రుల మీదకాదు; తనమీద, తన హాబీమీద!

(హాస్యప్రియ

# ఐశ్వర్య

"కేశవరావు - అంటే ఐశ్వర్య భర్త చనిపోయాడు. పాపం, నీకు తెలుసా?'' ఇంట్లోకి అడుగు పెట్టగానే అమ్మ అంది.

నాకు ఆ మాట వినగానే కళ్ళనీళ్ళు వచ్చాయి. ఉద్యోగంలో చేరిన తర్వాత కొన్నాళ్ళు సరదాగా సొంతవూళ్ళో గడపవచ్చని శలవు మీద వచ్చిన నాకు ఈ వార్త అశనిపాతమే అయింది.

పెళ్ళయి రెండు సంవత్సరాలు కూడా కాకముందే ఆమె పండంటి జీవితం నాశనమైపోయింది.

ఆరోజు ఉద్యోగం లేదనే వంకతో మామయ్య వచ్చి అడిగినప్పుడు ఐశ్వర్యతో పెళ్ళికి ఒప్పుకోకపోవడంవల్లే మామయ్య పంతం కొద్దీ మరో సంబంధం తీసుకొచ్చి ఐశ్వర్యకి పెళ్ళి చేసేసాడు. మామయ్యతో పాటు నేనూ ఇవాళ ఆమె ఈ స్థితికి రావడానికి కారకుణ్ణి! ఈ ఆలోచన నా మనసుని మెలివేయసాగింది.

ఐశ్వర్యని చూడడానికి మామయ్యా వాళ్ళింటికి బయల్దేరాను. దారి పొగుడునా ఐశ్వర్య గురించే ఆలోచన! ఆమె జీవితం మోడువారిపోవ డానికి వీల్లేదు. ఆమె జీవితాన్ని తిరిగి ఐశ్వర్యవంతం చేయాలి! ఈ ఆలో చనకి వచ్చినతర్వాత మనసు కొద్దిగా కుదుటపడింది.

"ప్రకటించిన కార్యక్రమానికి బదులుగా ప్రధానమంత్రి రా
పర్యటన విశేషాలు...."

ఒక్కసారి అందరూ ఘొల్లుమన్నారు

శ్రీనివాసరావు కోపంతో వూగిపోసాగాడు.

"శ్రీనివాసరావుగారూ! మీ కథ రానట్టేగా.... వస్తాం." ఒక్కొక్క
రేడియో దగ్గరనుంచి కదిలారు.

"పరువు తీశారు కదండీ...." భార్య సన్నాయి నొక్కుల
మరింతగా క్రుంగిపోయాడు శ్రీనివాసరావు.

సరిగ్గా ఈ సంఘటన జరిగిన వారం రోజులకి రేడియో వింటు
శ్రీనివాసరావు వులిక్కిపడ్డాడు.

"మేము ప్రసారం చేసే కార్యక్రమాల్ని శ్రద్ధగా విని తమ అ
ప్రాయాల్ని రాస్తున్న శ్రోతలకి ముందుగా మా ధన్యవాదాలు. గతవార
ప్రసారమైన శ్రీనివాసరావుగారి 'ఏవగింపు' కథ మాకు నచ్చిందంట
మా కార్యాలయానికి అసంఖ్యాకంగా వుత్తరాలు వచ్చా"యంటూ పే
చదువుతున్నారు.

భార్య ఎక్కడ వింటుందోననే భయంతో చటుక్కున కట్టేశాడ
ఆ పేర్లన్నీ తను కథమీద అభిప్రాయం రాయమని కోరిన మిత్రుల
పార్టీ తీసుకున్నామన్న మొహమాటంతో వినకుండా వుత్తరం రాసిపడేసా
మహానుభావులు! అప్పుడు శ్రీనివాసరావుకి ఏవగింపు కలిగింది—రేడియ
మీద, మిత్రుల మీదకాదు; తనమీద, తన హాబీమీద!

(హాస్యప్రియ

# ఐశ్వర్య

"కేశవరావు - అంటే ఐశ్వర్య భర్త చనిపోయాడు. పాపం, నీకు తెలుసా?'' ఇంట్లోకి అడుగు పెట్టగానే అమ్మ అంది.

నాకు ఆ మాట వినగానే కళ్ళనీళ్లు వచ్చాయి. ఉద్యోగంలో చేరిన తర్వాత కొన్నాళ్లు సరదాగా సొంతవూళ్ళో గడపవచ్చని శలవు మీద వచ్చిన నాకు ఈ వార్త అశనిపాతమే అయింది.

పెళ్ళయి రెండు సంవత్సరాలు కూడా కాకముందే ఆమె పండంటి జీవితం నాశనమైపోయింది.

ఆరోజు ఉద్యోగం లేదనే వంకతో మామయ్య వచ్చి అడిగినప్పుడు ఐశ్వర్యతో పెళ్ళికి ఒప్పుకోకపోవడంవల్లే మామయ్య పంతం కొద్దీ మరో సంబంధం తీసుకొచ్చి ఐశ్వర్యకి పెళ్ళి చేసేసాడు. మామయ్యతో పాటు నేనూ ఇవాళ ఆమె ఈ స్థితికి రావడానికి కారకుణ్ణి! ఈ ఆలోచన నా మనసుని మెలివేయసాగింది.

ఐశ్వర్యని చూడడానికి మామయ్యా వాళ్ళింటికి బయల్దేరాను. దారి పొడుగునా ఐశ్వర్య గురించే ఆలోచన! ఆమె జీవితం మోడువారిపోవ డానికి వీల్లేదు. ఆమె జీవితాన్ని తిరిగి ఐశ్వర్యవంతం చేయాలి! ఈ ఆలో చనకి వచ్చినతర్వాత మనసు కొద్దిగా కుదుటపడింది.

ఐశ్వర్యని చూడగానే తిరిగి మనసుని మెలిపెట్టినట్లయింది. బొ
లేని ఆమె ముఖం, బోసిమెడ.... అంతవరకూ నాలో అణచుకున్న బా
కట్టలు తెంచుకుంది.

''ఎవరి ఖర్మకు ఎవరు కర్తలు?'' కళ్లు తుడుచుకుంటూ అంది

'నువ్వారోజు నన్ను పెళ్ళాడివుంటే నాకీ పరిస్థితి వచ్చి వుండే
కాదుకదా?' అని ఆమె అడిగినట్లనిపించింది.

ఒక్క క్షణం ఇద్దరి మధ్యా నిశ్శబ్దం.

''ఐశ్వర్యా! నీ జీవితం ఇలా మోడువారిపోవడానికి వీల్లేదు
ఇప్పుడు నేను మంచి ఉద్యోగస్తుణ్ణి. నిన్ను పెళ్ళి చేసుకుంటాన
మామయ్యనడుగుతా.'' చటుక్కున ఆమె చేతులు పుచ్చుకుంటూ ఆవేశం
అడిగాను.

''మా అబ్బాయి ఏడుస్తున్నాడు. లోపలికి వెళ్తా. ఇప్పుడు నాలో
స్త్రీ భార్యగా సుఖాలకోసం ఎదురు చూడడం లేదు - తల్లిగా తన బాధ
తల్ని నెమరు వేసుకుంటోంది. వెంటనే నీకు పెళ్ళి చేసెయ్యమ
అత్తయ్యకి చెప్తాలే....'' మరో మాటకి అవకాశం ఇవ్వకుండా లోపలి
వెళ్ళిపోతున్న ఐశ్వర్యని ఆశ్చర్యంగా చూస్తూ వుండిపోయాను.

(కలువబాల

# ఓ వ్వు

కై మోడ్పు కనులతో కూర్చునివుంది మాధవి.

ఆమె మనసునిండా రవి గురించిన ఆలోచనలే! అతనిమీద ప్రేమారాధనతో హృదయం వుక్కిరిబిక్కిరవుతోంది.

ఒడ్డున కూర్చుని సముద్రాన్నే తిలకిస్తున్న ఆమె ఆలోచన్లు సముద్రంలోని అలలకన్నా వువ్వెత్తున ఎగిసిపడుతున్నాయి.

రవి ఇంకా ఎందుకు రాలేదూ?

ఒకవేళ వాళ్ళింట్లోవాళ్ళు తనతో పెళ్ళికి వప్పుకోలేదేమో!

వప్పుకోకపోతే తానేం చెయ్యాలి?

సరిగ్గా నెలరోజుల్రకితం రవి ఎవరో తనకి తెలీదు. ఇవాళ అతని మీదే తన భవిష్యత్తు ఆధారపడివుంది! విచిత్రంగా అనిపించింది మాధవికి.

చిన్న పడవలో చేపలు పట్టడానికి బయల్దేరుతున్నారు కొందరు.

"నువ్వెందుకయ్యా వత్తావు?...." ఓ ముసలివాణ్ణి వద్దని వారించారు మిగతావాళ్ళు.

"మా నాడు పెద్దయి నేతికంది వచ్చేంతవరకూ తప్పదు. నే నియాల అడికి పెడితేనేకదా ఆడు రేపు నాకు పెట్టేది... !" ముసలతను బలవంతాన మిగతావాళ్ళతో వేటకు బయల్దేరాడు.

తాము తెచ్చుకున్న ఆహారాన్ని ముక్కుల సాయంతో పిల్లల ముక్కుల్లోకి కూరే తల్లికాకులు గుర్తుకొచ్చాయి మాధవికి.

ఒక పెద్ద కెరటం ఆమె పాదాలదాకా వచ్చి కాళ్ళని తడిపి, వెనక్కి వెళ్ళిపోయింది. తన ఆలోచనల్లోంచి ఉలిక్కిపడి బయటి కొచ్చింది మాధవి. దూరంగా వస్తూ రవి కనిపించాడు.

ఆమెలో ఆనందకెరటం వుప్పొత్తున ఎగసిపడసాగింది.

అక్కడికి చేరుకున్న రవి ఆమె ప్రక్కనే ఇసుకలో కూలబడ్డాడు.

దిగులుగా వున్న అతడి ముఖాన్ని చూడగానే ఆమెకి విషయం చాలావరకు అర్థమైనట్లు అనిపించింది. ఆనందం ఆవిరైపోయింది.

"మా వాళ్ళు మరీ ఛాందసులు మధూ!.... కులపట్టింపు లెక్కువ. నే నెంతగా నచ్చచెప్పాలని ప్రయత్నించినా వాళ్ళు వినిపించుకోవడం లేదు...."

మాధవి కళ్ళు చెమ్మగిల్లాయి.

"నువ్వు కంటనీరు పెట్టుకోకు మధూ!....మా అమ్మా నాన్నే కాదు-ప్రపంచమంతా కాదన్నా మన పెళ్ళి ఆగేదిలేదు. వాళ్ళందర్నీ వదులుకు నైనా సరే- నిన్ను నా దాన్నిగా చేసుకుంటాను!"

హఠాత్తుగా ఆమె కళ్ళ ముందు ఇందాక చేపల వేటకి అందరూ వద్దన్నా బయల్దేరిన ముసలాయన మెరిసాడు. అతని మాటలు గుర్తు కొచ్చాయి.

"సారీ రవీ!.... ముప్పైఏళ్ళు కని పెంచిన తల్లిదండ్రుల్ని నిన్న గాక మొన్న పరిచయమైన నాకోసం వదులుకోవడానికి వెనుకాడని నువ్వు, రేపు నన్ను జీవితాంతం కాపాడతావని నమ్మకమేమిటి? నువ్వు నీ వాళ్ళం దర్నీ నాకోసం వదులుకోవడానికి సిద్ధంగా వున్నా, నిన్ను పెళ్ళి చేసు కోవడానికి నేను సిద్ధంగా లేను. నువ్వు చేసేది తప్పోగాదో చెప్పలేనుగాని, నేను చేసేది ఒప్పే!" తన కన్నీళ్ళతని ముందెక్కడ బయటపడతాయోనని ఆమె గబగబా అక్కడినుంచి కదిలింది. రవి స్థాణువై పోయాడు.

(ఈ వారం వారపత్రిక)

# ఓర్పు

ఆఫీసు గేటు బయట నిల్చున్న మార్వాడీని చూడగానే చెమటలు పట్టాయి రమణకి.

"రెండ్రోజుల్లో నాకివ్వాల్సిన మొత్తం ఇచ్చేయండి....వాయిదా వేసి కారణాలు ఏమిచెప్పినా ఈసారి నేను వినదల్చుకోలేదు." మార్వాడీ బెదిరింపులతో రమణకు గుండెదడ పెరిగిపోయింది.

అప్పులు చేయడం అతని హాబీకాదు. అలాగని అతనికి దుర్లవాట్లేమైనా వున్నాయా అని అనుమానించడమూ తప్పే!

తనకి పెళ్ళి కాకపోయినా - చదువులు పూర్తి కాని, జీవితంలో ఇంకా స్థిరపడని తమ్ముళ్ళు, చెల్లెళ్ళు వున్నారు. వాళ్ళంటే అతనికి అమితమైన ప్రేమ వుంది. అది చాలదూ అతను అప్పుల పాలవడానికి?

ఎప్పటికప్పుడు ఏదో ఓ అవసరం గండంలా తయారవుతోంది. ఆ గండాన్ని గట్టెక్కించుకోవడానికి ఎక్కడో ఒకచోట వడ్డీకైనా డబ్బు తీసుకొచ్చి సర్దాలి. లేకపోతే ఇన్నాళ్ళు వాళ్ళకోసం పడ్డ శ్రమ బూడిదలో పోసిన పన్నీరే అవుతుంది. అలా కాకూడదనే తాపత్రయం అప్పుని పెంచేస్తోంది.

రెండ్రోజుల్లో అప్పుని తీర్చడం ఎలా? ఎవరిని అడగాలి?

—రమణకు అర్థం కావడం లేదు.

నెమ్మదిగా సైకిలెక్కి బయల్దేరాడు - తెలిసిన ఒక్కొక్కళ్ళనే అప్పు అడుగుతూ! అప్పటికే వాళ్ళలో చాలా మంది దగ్గర తీసుకుని వుండడంతో ఎక్కడా అప్పు పుట్టలేదు.

జేబులో వున్నది యాభై రూపాయలు, తీర్చాల్సిన అప్పు
'ందలు!

ఎలా? ఎలా?

—హఠాత్తుగా గుర్తుకొచ్చాడు రూప్‌సింగ్. దాదాపు నాల్గు నెల
అతను తన దగ్గర రెండొందలు తీసుకుని....ఇంతవరకూ ఇవ్వ
ఏమైనా సరే ఇవాళా సొమ్మును వసూలు చేయాలి, మరో వందతో!

రమణ వెళ్ళేసరికి రూప్‌సింగ్ ఇంట్లోనే వున్నాడు.

"గురూ! అర్జంటుగా నా డబ్బు నాకివ్వు. మరో వంద కూడా
ర కావాలి...." గబగబా అడిగేయాలనుకున్నాడు రమణ.

అసలే తెల్లగా వుండే రూప్‌సింగ్ ముఖం మరింత తెల్లగా పాలి
ంది.

"మా అబ్బాయికి బాగుండడం లేదు...మందులకి డబ్బుల్లేక
ు పడుతున్నాను. వచ్చే నెల నీ డబ్బు నీకిచ్చేస్తా...." అతని
ం మాటల్లో ప్రతిధ్వనించింది.

వెంటనే రమణ చేయి జేబులోకి వెళ్ళింది.

యాభై నోటుని తీసి రూప్‌సింగ్ చేతిలో పెట్టి, ''ఈ యాభై ని
... మొత్తం వచ్చే నెల్లో ఇద్దుగాని.'' చటుక్కున వెనుతిరిగి సైకి
కు రమణ.

ఈ యాభైతో తన అవసరం ఎలానూ తీరదు. అతని అవసరమైనా
ంది. జీవితంలో ఒక్కడికైనా అప్పు పెట్టానన్న ఆనందమూ
ంది. ఈ ఆలోచన చాలు తనలో ఓర్పు పెంచడానికి! అతని
నలు రకరకాల సాగుతున్నాయి.

(ఈవారం వారపత్రిక)

ఈ 'కాలం' కథలు

# ఔదార్యం

కోఠీలో జనసంచారం తగ్గింది - బస్సులూ పలచబడ్డాయి.

ఆఫీస్ నుంచి బయటకు వచ్చేసరికే చీకటిపడి చాలా సేపయింది.
స్సుల కోసం ఎదురుచూస్తూ కూర్చుంటే ఇంకా ఆలస్యమై పోతుంది.
ి వెళ్ళడం మేలనిపించింది.

బస్‌స్టాప్‌లో ఒక్కటే రిక్షా ఆగివుంది. నెమ్మదిగా అటువేపు బయ
ు.

''ఎక్కడికెళ్ళాలి బాబూ?....'' త్రాగుతున్న బీడీని పారేసి చటు
ు నిలబడ్డాడు రిక్షా అతను.

''చిక్కడపల్లి....''

''నాల్గు రూపాయలివ్వండి.''

''నాలుగా! మూడు రూపాయలిస్తాను'' పొరపాటున కూడా రిక్షాని
ాడకుండా ఎక్కకూడదు. వాళ్ళు ఆడిగినంత మనం బేరమాడకుండా
మూ అంటే అది ఎంత ఎక్కువైనా వాళ్ళకి తృప్తి వుండదు.
్న వూరికే రిక్షాలో త్రిప్పినట్లు బాధపడిపోతారు. ఇంకొంతమందైతే
ాడి ఎక్కినా, గమ్యం చేరేసరికి ఎక్కువివ్వమని పేచీ పెడతారు.
ా అరిస్తే నలుగురు ఎక్కడ వింటారోననే భయంతోనైనా అవతలి
ు అడిగినంతా ఇస్తారని వాళ్ళ ధీమా!

''మూడున్నరిప్పించండి....'' వాడు తగ్గినా నేను తగ్గకూడదను
్ను.

"మూడు రూపాయలకన్నా పైసాగూడా ఇవ్వను. వస్తేరా- నీ ఇష్టం...."

"పోనీ, మూడుంబావలా ఇవ్వండి." బ్రతిమాలుతున్నట్లడిగాడు. అతను దిగివస్తున్న కొద్దీ నాలో బింకం పెరిగింది.

రెండడుగులు ముందుకు వేసాను రిక్షాని తీసుకొచ్చి ప్రక్క నాపాడు.

"ఎక్కండి...."

"మూడు రూపాయలే ఇచ్చేది." మరోసారి హెచ్చరించి, ధీమాగా, రిక్షా ఎక్కి కూర్చున్నాను.

'అప్'ని ఎక్కించి, చెమటలు కక్కుకుంటూ ఎంతో ప్రయాసతో నన్ను గమ్యాన్ని చేర్చాడు.

అంత చల్లటి వాతావరణంలోనూ చెమటలు కక్కుతున్న అతడిని చూసేసరికి జాలేసింది.

నాల్గు రూపాయలు తీసి అతనికిచ్చాను.

రూపాయి తిరిగి ఇవ్వబోయాడు.

"వద్దులే.... వుంచుకో...." అతన్ని గమనించనట్లే గుమ్మం వేపు కదిలాను.

కుదుర్చుకున్న బేరంకన్నా కాస్త ఎక్కువ ఇస్తే రిక్షావాళ్ళు ఖచ్చితంగా ఆనందపడతారు. మనల్ని పొగుడుతారు.

"వద్దండి.... ఈ రూపాయి మీరే తీసుకోండి. నా శ్రమకి మూడు రూపాయలే ఇస్తానని మీరన్నారు. నేనందుకు వప్పుకుని వచ్చాను. నా శ్రమకి తగ్గ ప్రతిఫలమే నాకు చాలు." ఆ రూపాయి నా చేతిలో వడేసి రిక్షాని ముందుకురికించాడు. నా ఔదార్యం మీద అతని ఆత్మాభిమానం గట్టి దెబ్బ తీసింది!

(ఈవారం వారపత్రిక)




## కథ కంచికి

చుండూరు,
14-10-1952

గురువుగారూ, నారాయణ్రావ్ గారూ —

ఆరోజు అనుకోకుండా పెళ్ళిలో మీతో పరిచయమై, మీతో మాట్లాడిన తర్వాతే నాకూ కథలు రాయాలనే ఆలోచన వచ్చింది, రావడమే ఆలస్యం ఓ వారం రోజులు కష్టపడి ఓ కథని రాశాను. దాన్ని మీకు పంపిస్తున్నాను. ఈ 'కలకాలం కన్నీరు' కథ మీద మీ అభిప్రాయం తెలుసుకున్న తర్వాతే ఏ పత్రికకైనా పంపుదామనుకుంటున్నాను. ఏవైనా కరెక్షన్స్ అవసరమైతే చేస్తారు కదూ?

మీ
బాబురావు

విజయవాడ
14-11-1952

సచ్చిదానందం—

సినిమా కథకోసం నేను పంపిన 'కలకాలం కన్నీరు' కథ సినా ప్సిస్ చదివావనుకుంటాను. ఆ కథ నీకు నచ్చిందా? నీ దగ్గరనుంచీ జవాబు వచ్చిన తర్వాతే దానిని ఏ పత్రికకైనా పంపాలా- వద్దా? అనేది ఆలోచిస్తాను. వెంటనే జవాబు రాస్తావుకదూ?

—'మీనా'
(మీసాల నారాయణరావ్)
మద్రాసు
14-12-1952

డియర్ మీనా—

నీ కథ 'కలకాలం కన్నీరు' చాలా మంది నిర్మాతలకి వినిపిం చాను. ఆఖరికి ఓ నిర్మాత ఈ కథని చిత్రంగా తియ్యడానికి ముందు కొచ్చాడు. నాకు దర్శకత్వం చాన్స్ ఇవ్వాలనే కండిషన్ కూడా అతను ఒప్పుకున్నాడు. కాకపోతే అతనూ ఓ కండిషన్ పెట్టాడు. తను నిర్మాతగానే గాక కథకుడుగా కూడా మారాలని! అంటే- నీకు విషయం అర్థమైపోయి వుంటుందనుకుంటాను. ఆయన నీకు కొంత డబ్బుని ముట్ట చెబుతాడు- అంతే! నువ్వా కథ సంగతి మరచిపోవాలి. కథని ఆ నిర్మాత గారే రాశారన్న మాట! వెంటనే బయల్దేరి వస్తావు కదూ?

—సచ్చిదానందం

(జ్యోతి మాసపత్రిక)

# ఖండన

)డిటర్ గారికి—

మీ (మా) పత్రికలో గతమాసం ప్రచురింపబడిన కవితానందగారి కాపి - కాఫీ' కథ, ఇంతకుముందే ప్రచురితమైన గలాటాశ్రీగారి 'కాపీయం' కథకి మక్కీకి మక్కీ కాపీ అనే విషయాన్ని మీకు తెలియ జెయ్యడానికి చింతిస్తున్నాము. గలాటాశ్రీగారి కథ కాపీని కూడా దీనితో జతపరుస్తున్నాను. ఇకముందు ఇటువంటి కాపీ కథల్ని ప్రచురించి మన పత్రిక స్థాయిని దిగజార్చవద్దని కోరుతున్నాను.

—ఉత్తరాలరావ్ (లేఖాపురం)

కవితానంద్ గారికి—

మా పత్రికలో ప్రచురించిన మీ కాపీ - కాఫీ' కథ గలాటాశ్రీగార 'కాపీయం' కథకు పూర్తి కాపీ అని పాఠకులు మా దృష్టికి తేగా, మేము రూఢీ పరచుకున్నాము. ఈ విషయంలో పాఠకులకి, పత్రికకి మీరిచ్చే సంజాయిషీని వెంటనే తెలియజెయ్యండి.

—ఎడిటర్ ('మా' పత్రిక)

ఎడిటర్ గారికి—

మీ ఆరోపణని నేను ఖండించడం లేదు. అలాగని తప్పంతా నాదే నని నేనొప్పుకోబోవడమూలేదు. మా వుత్తరం వచ్చిన తర్వాతే గలాటాశ్రీ గారి కథ చదివాను. అంతకు ముందు ఒక్క గలాటాశ్రీగారి కథనే కాదు-మరి యే తెలుగు రచయిత కథనీ చదవలేదు. కానీ కనిపించిన ప్రతీ ఇంగ్లీషు పుస్తకాన్ని ఆమూలాగ్రం చదివే అలవాటు నాకు చిన్నప్పటి నుంచీ వుంది. 'అన్ని ఇంగ్లీష్ కథలు, నవలలు చదువుతావు, తెలుగులో వాటినే ఎందుకు రాయడానికి ప్రయత్నించవు!' అన్న ఓ మిత్రుడి సలహా మీద ఓ ఆంగ్ల కథననుసరించి తెలుగుకథ రాసి మీకు పంపాను. కాక పోతే నేను ఆలోచించని విషయం ఒక్కటే - నాకన్నా ముందే ఎవరో ఒకరు ఈ ఆంగ్ల కథలని చదివి వుండకపోతారా అని. అసలు పొరబాటు ఎలా జరిగిందో ఈ పాటికి మీకర్థమయ్యే వుంటుందనుకుంటాను. మళ్ళీ ఎప్పుడూ కథలు రాసే ప్రయత్నం చేయనని మీకు హామీ ఇస్తూ—

—కవితానంద్ (కథలపురం)

(జ్యోతి మాసపత్రిక

# గడుసరి

విజయవాడ
4-3-1978

ంహగర్జన సంపాదకులకు—

మీకు గత నాలుగు సంవత్సరాలుగా టన్నులకొద్దీ కథల్ని పంపుతూనే వున్నాను. కానీ మీరు వాటిలో ఒక్కదాన్ని కూడా మిగుల్చుకోకుండా సాధ్యమైనంత త్వరలో వాటిని నా కందించే ఏర్పాట్లు చేస్తూనే వున్నారు. విసుగుచెందని విక్రమార్కునిలా నేను ప్రయత్నిస్తూనేవున్నాను. దయచేసి మీరు నా ఒక్క కథనయినా ప్రచురించి నా మీద 'రచయిత' అనే ముద్రని వేయవలసిందిగా మరీ మరీ కోరుతున్నాను. మీ సహకారాన్ని అభ్యర్థిస్తూ—

—సింహాచలం.

విజయవాడ
7-2-1981

సింహగర్జన సంపాదకులకు—

ఈ మధ్య మీరు నాకిస్తున్న ప్రోత్సాహానికి నేనెంతో కృతజ్ఞుణ్ణి. 'ఇక నా కథలు ప్రచురింపబడవు, నేను రాయడం మానుకోవడం ఉత్తమం' అనే నిర్ణయానికి నేనొచ్చిన రోజుల్లో నా మొదటి కథను ప్రచు

రించి, తిరిగి నాలో ఉత్సాహాన్ని రేకెత్తించారు. మిగతా పత్రికలవాళ్ళు నా కథల్ని అడపాదడపా ప్రచురిస్తుంటే, మీరు అతి తరచుగా ప్రచురిస్తూ రచయితగా నాకో స్థానాన్ని కల్పిస్తున్నారు. మీ సహకారానికి కృతజ్ఞతలు తెల్పుకుంటూ—

—సింహాచలం.

విజయవాడ
10-5-1983

సింహగర్జన సంపాదకులకు—

ప్రత్యేకసంచికకి కథని పంపమని మీరు రాసిన ఉత్తరం అందింది. చూస్తున్నారుగా—ఈమధ్య ఏ పత్రిక చూసినా నా కథలే! తీరిక లేకుండా వుంటోంది. రెమ్యునరేషన్ పే చెయ్యడంలో కూడా ఒకరికొకరు పోటీ పడుతున్నారు. కాబట్టి మీరు వెంటనే అర్ధ వెయ్యినూటపదహార్లకి డ్రాఫ్ట్ పంపితే, నేను సాధ్యమైనంత త్వరలో కథను పంపుతాను. మీ అభిమానానికి సంతోషిస్తూ—

—సింహాచలం.

(జ్యోతి మాసపత్రిక)

# ఘంటాపథము

మద్రాసు
10.5.92

రాజమణికి—

ఈమధ్య మావారు కాంప్‌లకు ఎక్కువగా వెళ్తున్నారు. దాంతో నాకు టైమ్ బాగా దొరుకుతోంది. ఈ నెలలో నాల్గు నవలలు, పన్నెండు కథలు రాశాను. అన్ని మాగజైన్లలోనూ నా రావలసిన నవలలు, కథలు వున్నాయి. అందుకని ఇప్పుడు మళ్ళీ పంపడం అనవసరం. డిమాండ్ తగ్గుతుంది! అందుకనే వాటన్నింటినీ లాకర్‌లో పెట్టేశాను. అవసరాన్ని బట్టి వాడుకోవచ్చు కదా? నీ వ్యాసాంగం ఎలా వుంది.

సి
కన్యాకుమారి.

హైద్రాబాద్
12.5.92

కన్యాకుమారికి—

నీ వుత్తరం అంది, నీ అభివృద్ధికి చాలా సంతోషించాను. ఈమధ్య నాకు రాసుకోవడానికి అసలు టైమ్ దొరకడంలేదు. కానీ గాప్ వస్తే బాగుండదు కదా? అందుకని నాకో మూడు నవల్లు, నాల్గు కథలు అప్పుగా

ఇవ్వు - నా పేరుతో పంపుకుంటాను. మరో అయిదారు నెలలు పోయిన తర్వాత నేను నాల్గు నవల్లు, ఆరు కథలు పంపుతాను.

నీ
రాజమణి.

మద్రాసు.
15.5.92.

రాజమణీ—

నువ్వు కోరినట్లే మూడు నవల్లు, నాల్గు కథలు పంపుతున్నాను. ఆరునెలలకే పంపు, ఫర్వాలేదు. అవసరంలో వున్నప్పుడు స్నేహితురాళ్ళం ఒకళ్ళనొకళ్ళు ఇలా ఆదుకోకపోతే ఎలా? రేపు నాకే ఇలాంటి అవసరం రావచ్చు. మనమధ్య మొహమాటం వుండకూడదని నేను ఘంటాపథంగా చెప్తున్నాను. అర్థమైందా?

నీ
కన్యాకుమారి.

(ఆంధ్రపత్రిక)

# చపలచిత్తుడు

శ్రీవారికి—

నేనక్కడలేనుకదాని ఏ అర్ధరాత్రో, అపరాత్రో ఇంటికి చేరకండి. నేను పురిటికోసం మా వాళ్ళింటికి వచ్చినా, నా దిగులంతా మీ కోసమే! మా వదిన పుట్టింటికి వెళ్ళింది. అలాగని మా అన్నయ్య బలాదూర్ తిరగడంలేదు. బుద్ధిగా కూర్చుని కథలు రాసుకుంటున్నాడు. దానివల్ల పేరుకు పేరూ వస్తుంది,డబ్బుకుడబ్బూ వస్తుంది.కాబట్టిమీ చపలచిత్తంతో కాలాన్ని వృధాచేయక ఏ కథలు రాయడానికో ప్రయత్నించండి. ఒక్క కథయినా మీది ప్రచురణార్హత పొందితేనే నేను మళ్ళీ అక్కడికి వచ్చేది గుర్తుంచుకోండి.

మీ, శ్రీమతి.

శ్రీమతిగారూ—

మీ కోరిక నెరవేరింది. మనకి అబ్బాయి పుట్టాడన్న తియ్యటి వార్తని నువ్వు రాస్తే, నా మొదటి కథ ప్రచురింపబడిందనే తియ్యటి వార్తని నేను రాస్తున్నాను. కథను కూడా పంపుతున్నాను. నువ్వెప్పుడు బయల్దేరాలనుకుంటున్నావో రాయి.

నీ రఘు.

శ్రీవారికి,

మీ కథ ప్రచురింపబడిందన్న విషయం నా కానందాన్ని కలిగించినా, ఇతివృత్తం నన్ను కలవరపరచింది. వేశ్యల గురించి అన్ని విషయాలు మీకెలా తెలిసాయి? నాకు అనుమానంగా వుంది మీమీద. మా అన్నయ్య ఎన్నో కథలు రాశాడు. కానీ ఇలాంటి కథల్ని వాడెప్పుడూ రాయలేదు. మీలాంటి చపలచిత్తుణ్ణి నమ్మి నేను కాపురానికి రాలేను.

రాధ.

శ్రీమతిగారూ—

ఆఖర్న మీ శ్రీమతి అనిగాక రాధ అని రాయడంలోనే నీకెంత కోపం వచ్చిందో అర్థమైంది. గట్టిగా ఉత్తరం రాయడమే చేతగాని నేను కథని ఎలా రాయగలననుకున్నావ్? నీ కోరిక, ప్రతిజ్ఞ మీ అన్నయ్యకి రాసి శరణు వేడాను. ఆయనే నా పేర ఓ కథని రాసి పంపాడు. కాబట్టి చపలచిత్తుడెవరో నీకర్థమైపోయి ఉంటుందనుకుంటాను. ఎప్పుడొస్తున్నావ్? ఎదురుచూస్తున్నా—

నీ రఘు.

(ఆంధ్రపత్రిక)

# చక్కిలిగిలి

విజయవాడ,
1.2.84.

నాన్నగారికి—

మీరు రాసిన వుత్తరం అందింది. కానీ ఇప్పుడు నా ఆర్థిక పరిస్థితి అంతగా బాగోలేదు. అందుకనే మీరు ఇబ్బందిలో వున్నారని రాసినా ఆదుకోలేకపోతున్నాను. మీరు వుత్తరం రాయడం వారం ఆలస్యమైతే, నా దగ్గర నుంచే మీకు అటువంటి వుత్తరం అంది వుండేది. వేరేగా భావించవద్దని కోరుతూ—

మీ కుమారుడు.

విజయవాడ
1.2.84

డియర్ శ్రీమతీ-

నీ అంచనా సెంట్ పర్సెంట్ కరెక్ట్. ఇది మా బోనస్ వచ్చే నెల అని మా నాన్నగారికి తెలుసు. ఆయన అవసరమంటూ అర్జంటుగా డబ్బు పంపమని రాశారు. నువ్వు పుట్టింటికి వెళ్తూ మరీ మరీ చెప్పినట్లు- నేనే చాలా ఇబ్బందులోవున్నా, నా వల్ల కాదు అంటూ ఇవాళే ఆయనకి వుత్తరం రాసి నీకు అయిదు వేలు డిమాండ్ డ్రాఫ్ట్ పంపుతున్నాను. ముత్యాల

హారం చేయించుకో. త్వరలోనే నీ దగ్గరనుంచి శుభవార్త అందుతుందని ఆశిస్తూ ఈ చిన్న బహుమతితో నీకు గిలిగింతలు పెట్టాలనుకున్నాను.

నీ బ్రహ్మం.
రాజమండ్రి,
3-2-84

చిరంజీవి బ్రహ్మన్ని ఆశీర్వదించి వ్రాయునది—

నువ్వు రాసిన వుత్తరం అందింది. కానీ అది నాకు రాసింది కాదు. బహుశా నాకు, మీ ఆవిడకి ఒకేసారి వుత్తరాలు రాసుంటావు. కాని పొరబాటున ఒకళ్ళ వుత్తరం మరొకళ్ళకి పంపావు. మీ ఆవిడకి చక్కిలిగింతలు పెట్టడమేమోగాని నాకు కళ్ళు తెరిపించావు. నీ చదువుకి నేను పెట్టిన ఖర్చుకు డిమాండ్ డ్రాఫ్టుని సాధ్యమైనంత త్వరలో పంపు.

—సాంబమూర్తి.

(ఆంధ్రపత్రిక

# జతగాడు

6-1-79

రాజ్యలక్ష్మిగారూ—

మీతో ఈ విషయాన్ని ముఖతా చెప్పలేక ఇలా ఉత్తరం ద్వారా తెలియజేస్తున్నాను. అపార్థం చేసుకోకుండా ఆసాంతం చదివి, ఆలోచించి ఓ నిర్ణయానికి రండి. మీ నిర్ణయానికి నేను బద్ధుడను. నాకు ఉద్యోగం వచ్చి సంవత్సరం దాటిపోవడంతో మా వాళ్లు పెళ్ళి చేసుకోమని వత్తిడి చేస్తున్నారు. మీరంటే నాకు మొదటి నుంచి ఓ ప్రత్యేకాభిప్రాయం. మీరు ఇష్టపడితే మిమ్మల్ని పెళ్ళి చేసుకోవాలని నా కోరిక. దయచేసి మీ అభిప్రాయాన్ని వెంటనే తెలియజెయ్యండి.

—శేఖర్,

7-7-79

డియర్ రాజూ—

ఎన్నాళ్లు నువ్వు పుట్టింట్లో వుంటావు? నువ్వు లేకుండా నాకు అన్నం సయించడం లేదు. నిద్రపట్టడం లేదు. తొందరగా వచ్చేయ్. ఈ వుత్తరం రేపు నీకు చేరుతుంది. రేపు రాత్రి నుంచే అటు నుంచీ వచ్చే ప్రతీ ట్రయిన్ దగ్గరకి వస్తాను. వెంటనే బయల్దేరు- అర్జంట్.

—నీ శేఖర్.

2-3-80

రాజ్యం—

ఇలా ప్రతీ చిన్న విషయానికీ అలిగి మాట్లాడకుండా కూర్చుంటే ఎలా? నేనేమన్నానని! నీ మౌనాన్ని భరించలేను. నీతో ఈ విషయాలన్నీ చెప్పాలని నిన్నటి నుంచీ ప్రయత్నిస్తున్నాను. కానీ నువ్వు మాట్లాడకుండా తప్పించుకు తిరుగుతుండడంతో ఇలా రాస్తున్నాను. సాయంత్రం నేను ఆఫీసునుంచీ వచ్చేటప్పటికి నువ్వు నవ్వుతూ ఎదురొచ్చి పలకరించాలి-సరేనా?

—నీ భర్త.
5-6-81

రాజ్యలక్ష్మి—

ఇలా నువ్వు చీటికీ మాటికీ మాట్లాడడం మానేసి చిన్నపిల్లలా ప్రవర్తించడం నాకేమీ నచ్చలేదు. ఇన్నాళ్లూ నాతో మాట్లాడకపోయినా ఇంట్లోనే వుండేదానివి కాబట్టి నేనంత సీరియస్‌గా తీసుకోలేదు. కానీ, ఇప్పుడు నువ్వు మరో మెట్టు దిగజారి కోపంతో పుట్టింటికి వెళ్ళావు. నిన్ను రమ్మని పిలవడానికి నేను ఈ పుత్తరం రాయడంలేదు. మళ్ళీ ఎప్పుడూ ఇలా ప్రవర్తించనని క్షమాపణలు చెప్పుకుంటే రా....

—శేఖర్.

(జ్యోతి మాసపత్రిక)



# డిటో....

"హలో...."

"కమలాకర్‌గారున్నారా?"

"పిలుస్తాను ఆగండి."

............

"కమలాకర్ స్పీకింగ్...."

"నేను.... కన్యని...."

"ఏమిటి?"

"ఏమీలేదు. మీకు ఫోన్ చెయ్యాలనిపించింది- చేసాను."

''ఊహూ....''

''మరయితే మాట్లాడండి.''

''....''

''సాయంత్రం ఏ సినిమాకో వెళ్దామని మీకు ఫోన్ చేస్తే జవాబు కూడా ఇవ్వరేం? అయినా ముందు ఫోన్ చెయ్యడం నాదే తప్పులెండి.''

''అది కాదు కన్యా....''

"ఏదికాదు? వలచి వచ్చిన వాళ్ళని ఛీ కొట్టడం, ఛీ కొట్టిన వాళ్ళ వెంట పడడం మీ మగవాళ్ళకి అలవాటే కదా! బుద్ధి తక్కువై ఫోన్ చేసా. నేను మళ్ళీ చెయ్యనుగాక చెయ్యను.''

''....''

''మాట్లాడినా, పోట్లాడినా కూడా నోరు మెదపరేం? అల్ రైట్, అదీచూస్తాను....''

*   *   *

"హలో ..."

''కన్యాగారున్నారండీ?''

''పిలుస్తాను ఆగండి....''

''కన్యా స్పీకింగ్!''

''నేను కమలాకర్‌ని.''

''ఏమిటి?''

''నామీద కోపం వచ్చిందా? ఇందాక నువ్వు ఫోన్ చేసింది మా ఆఫీసర్ దగ్గరకి. ఎవరికి ఫోన్ వచ్చినా ఆయన చెవులు అటే వుంటాయి. అందుకని ఇందాక నువ్వు ఫోన్ చేస్తే సరిగ్గా మాట్లాడలేకపోయాను.''

''అలాగా?''

''అలా పొడిపొడిగా మాట్లాడకు కన్యా, ప్లీజ్.... నీకు కోపంవచ్చి వుంటుందనే భయంతోనే నేనిలా ఆఫీసు బయటకి వచ్చి నీకు ఫోన్ చేస్తున్నాను.''

''సరే....''

"మా ఆఫీసర్ వట్టి వెధవ కన్యా! సాయంత్రం సినిమాకు వెళ్దామని నీకు ఫోన్‌లో చెప్పడం విన్నాడంటే సాయంత్రం ఆఫీసులోనే లేటయ్యేటట్లు నాకేదో పని చెప్తాడు.''

''ఊహూ....''

''ఇంకా నా మీద కోపం తగ్గలేదా? కన్యా! ప్లీజ్ కాస్త నోరు విప్పి మాట్లాడు... ''

''ఇందాకటి నీ స్థితి గుర్తు తెచ్చుకో. అదే నా పరిస్థితి. అవతల అర్జంటు పనుంది. వుంటా."

(ఉదయం వారపత్రిక)

# 'శాస్త్రీ'యం బూతు

''హలో....''

''ఎస్....''

''శాస్త్రి కావాలండి?''

''వన్ సెకండ్''

........

''శాస్త్రి స్పీకింగ్''

''నీయవ్వ, ఎక్కడ చచ్చావురా, దర్శనాలే లేవు!''

''మీరు....''

''మీరు, గారు ఏంటిరా....నేనేరా లం....''

''క్షమించాలి ..''

''హహ్హహ్హ.... ఏరా నా కొడకా.... ఏదైనా నాటకం రిహార్సల్స్ వేస్తున్నావా? బూతుమాటలేకుండా ఒక్క వాక్యం కూడా మాట్లాడడం చాతగాని నువ్వు ఎంత శుభ్రంగా మాట్లాడుతున్నావ్‌రా!''

''అయ్యా.... మీకు కావలసింది రామశాస్త్రి అనే నేను కాదు. మా ఆఫీసులోనే పనిచేసే బూతులశాస్త్రి అని పిలువబడే మరో శాస్త్రి. అతన్ని పిలుస్తాను, ఇద్దరూ కలసి మనసారా తిట్టుకోండి.

ఈసారి ఫోన్ చేస్తే 'శాస్త్రి' అని అడక్క 'బూతులశాస్త్రి' అని అడగండి....''

* * *

"హలో...."

"ఎస్...."

"శాస్త్రి కావాలండి"

"వన్ సెకండ్."

... ....

"శాస్త్రి స్పీకింగ్."

"మీ పద్ధతి మాకేం నచ్చలేదండి. ఇన్‌స్టాల్మెంట్‌లో గుడ్డలు పట్టుకెళ్ళి నాల్గు నెలలైంది. ఇంతవరకూ ఒక్క పైసా కూడా చెల్లించ లేదు....."

"నీ యవ్వ, నీ దగ్గర ఏ లం....కొడుకు గుడ్డలు తెచ్చాడయ్యా?"

"బాగుండండి మీ వరస. అసలుకే ఎసరు పెట్టాలని చూస్తున్నారా? మీ దగ్గర నుంచీ పైసలు ఎలా రాబట్టాలో నాకు బాగా తెలుసు...."

"తెలిస్తే ఏం చేసుకుంటావో చేసుకోరా దొం ...నా...."

"పైసలు ఎగ్గొట్టాలని చూడడమేగాక బూతులు తిడతావా?"

"తిట్టక ముద్దెట్టుకోమంటావా? ఫోన్ చెయ్యగానే సరిపోతుందా? నీకు కావలసింది ఏ శాస్త్రో అడిగి మాట్లాడవచ్చుగా? మా ఆఫీసులో ముగ్గురం శాస్త్రులం వున్నాం."

"అయితే మీరు సుబ్బరాయశాస్త్రి కారా?"

"కాదు వెంకట్రాయశాస్త్రిని. ఈ ప్రశ్న మొదటే అడిగివుంటే ఈ వెధవ....గోల వుండేది కాదుగా....! ఆయన్ని పిలుస్తాను, తీరిగ్గా బెదిరించు."

* * *

''హలో....''

''ఎస్....''

''శాస్త్రిగారున్నారా?''

''వన్ సెకండ్....''

''మీరు మాట్లాడకండి. నేను చెప్పేది వినండి. నేను సూపరింటెండెంట్ రామశాస్త్రిని. కాబట్టి మీకు కావలసింది నేనో కాదో ముందు తేల్చుకోండి.''

''నాకు శాస్త్రంటే పూర్తి పేరు తెలీదండి.''

''అయితే కష్టం. ఈసారి ఆయన్ని కలుసుకున్నప్పుడు సూపరింటెండెంట్ శాస్త్రి? బూతుల శాస్త్రి? అప్పుల శాస్త్రి? ఎవరు మీరు అని అడగండి. అలా అడిగితే తప్ప శాస్త్రి అని పిలుస్తే ఈసారి ఎవ్వరూ పలకరు. వుంటా.''

(ఉదయం వారపత్రిక)

# గుట్టు రట్టు

"హలో, రాజశేఖరంగారున్నారా?"

"స్పీకింగ్...."

"నమస్కారం సార్.... నా పేరు రజని."

"నమస్కారమండి...."

"మీ రచనలంటే నాకెంతో ఇష్టమండి."

"చాలా సంతోషమండి."

"నాకూ చాలా సంతోషంగా వుందండి. నా అభిమాన రచయితతో ఇలా ఫోన్ ద్వారానయినా మాట్లాడగల్గుతున్నందుకు...."

"భలేవారే! అనుకోవాలేగానీ ఫోన్ ద్వారానే ఏమి ఖర్మ- ముఖా ముఖీనే మాట్లాడుకోవచ్చు...."

"థాంక్యూ...."

"నోమెన్షన్."

"మిమ్మల్ని ఎలా కలుసుకోవాలి? ఆఫీసుకి రమ్మంటారా?"

"అమ్మమ్మ.... ఆ పని మాత్రం చెయ్యకండి. ఇక్కడున్న మగాళ్ళందరూ దగుల్బాజీ వెధవలు. పరాయి ఆడది కనిపిస్తే చాలు-ఎలా ప్రవర్తిస్తారో వాళ్ళకే అర్థం కాదు...."

"పోనీ, మీ ఇంటి అడ్రసు చెప్పండి. అక్కడికే వస్తాను."

"బాబోయ్....ఆ పని అసలు చెయ్యకండి. అదంతకన్నా డేంజర్...."

''ఏమండీ.... మీ ఇంటి దగ్గర కూడా దగుల్బాజీ మగ వెధవ లున్నారా?''

''అంతకన్నా పెద్ద దగుల్బాజీ ఆడవెధవ ఉంది. నా కోసం ఎవరయినా ఆడపిల్ల వస్తే ఇంకేమయినా వుందా, అది అనుమానంతో కుళ్ళిపోతుంది!''

''నిప్పులేనిదే పొగ రాదని మీ కథల్లో తెగ రాస్తుంటారుకదండీ?''

''కథలు వేరు, జీవితం వేరు. ఆ విషయాలు అంతటితో వదిలే యండి. సాయంత్రం సరిగ్గా ఆరు గంటలకల్లా లిబర్టీకి వచ్చేయండి. ఫస్ట్ షో చూస్తూ కబుర్లు చెప్పుకుందాం.''

''అలాగే బావా....''

''బావా!''

''అవును బావా—నేను రమని. మీ మరదలిని. ఇందాకే వచ్చాను వూరు నుంచి. అక్కయ్య ఇలా ఫోన్ చెయ్యమంటే చేసాను. అక్కయ్య మాట్లాడుతుందిట, మాట్లాడు.''

''నేను సాయంత్రం సినిమాకి వెళ్దామంటే అర్జంటు ఆఫీసు పను లున్నాయన్నారు?''

''అబ్బే.... ఏంలేదు....పెందలాడే వచ్చేస్తాను, ముగ్గురం సినిమాకి వెళ్దాం.''

''పక్కన నేనున్నా, మీతో పాటు మా చెల్లెల్ని సినిమాకి చచ్చినా రానివ్వను....''

''నాకు అర్జంటు పనుంది. తొందరగా వచ్చేస్తాలే.''

(ఉదయం వారపత్రిక)

# ఎవరు మాట్లాడుతున్నారో ముందు తెలుసుకో!

హాలో.... అరుంధతి! సాయంత్రం ఆరుగంటలకి గార్డెన్ దగ్గరికి రా....''

''....''

''ఏమిటి మాట్లాడవ్? సాయంత్రం తప్పకుండారా. నీ కోసం చూస్తూంటాను ''

''...''

''ఏమిటి మాట్లాడవ్.... నిన్న మా ఆఫీసర్‌గాడు ఏదో పనంటూ కూర్చోపెట్టేశాడు. అందుకని రాలేకపోయాను.... ఈరోజు వాడింకా రాలేదు. అందుకే ఫోన్ చేశాను.... పెట్టేస్తాను.... మా పీనుగ ఏ క్షణాన్నైనా రావచ్చు. ఈ ఆఫీసు ఫోను వాడి సొంతం అనుకుంటాడు. ఎవరయినా ఇక్కణ్ణించి ఫోన్ చేస్తే భరించలేడు.... పెట్టేస్తాను. ఒక్కసారి మాట్లాడు....''

''....''

"మిమ్మల్నేనండి టెలిఫోన్ ఆపరేటర్ గారూ.... మీరు ఫోన్ చేయడానికి ఇబ్బంది వుండదు గాని నాకు చాలా ఇబ్బంది.... ప్లీజ్....కోపాన్ని వదిలిపెట్టి నవ్వుతూ ఒక్క ముక్క మాట్లాడు. మా ఆఫీసరు వెధవ లేడు.... ప్లీజ్....''

''ఎవ్రరా నువ్వు?''

''నువ్వెవరివిరా.... నా అరుంధతికి ఫోన్ చేస్తే ఫోన్‌లో నువ్వేలా వచ్చావ్.... వచ్చినవాడివి నోరు మెదపకుండా నేను మాట్లాడేదంతా ఎలా విన్నావ్....?''

''నీకు మీ ఆఫీసర్ మీద ఎంత ప్రేముందో తెలుసుకుందామని''

''నాకు మా ఆఫీసర్ మీద ప్రేముందో, అరుంధతి మీద ప్రేముందో తెలుసుకోవడానికి నువ్వెవడివిరా....''

"నేనెవర్నో....ఈ ప్రశ్నకు జవాబు చెప్పే ముందు నాకో సందేహం తీర్చు. .."

"తొందరగా అడుగు. మళ్ళీ మా ఆఫీసర్‌గాడు...."

''రాడుగాని తొందరపడకు....''

''నీకెలా తెల్సు....?''

''అన్నీ తెల్సు.... మీ ఆఫీసులో అందరూ మీ అఫీసర్ని నీ లాగానే తిడతారా?''

''భలే సందేహమొచ్చిందయ్యా నీకు.... మా ఆఫీసులో మా ఆఫీసర్‌గాణ్ణి తిట్టని వెధవుండడు....''

''మరతనిముందు అందరూ అంత అతివినయాలు నటిస్తారేం?''

''ఎవరు చెప్పారు నీకు అతివినయాలు నటిస్తారని? అది పచ్చి అబద్ధం....''

''కాదు- పరమ నిజం!''

''మా ఆఫీసులో విషయాలు నాకన్నా నీకు ఎక్కువ తెల్సా?''

''తెల్సు....''

''మరయితే అందరూ మీ ఆఫీసర్ గురించి ఇలాగే వాగుతారా అని నన్నెందుకు అడిగావ్?''

''నాముందు ఎలా మాట్లాడుతారో నాకు తెల్సుగాని ....నా వెనుక ఎలా బిహేవ్ చేస్తారో నాకు తెలీదుగా....''

''మీరు.... మీరు....''

''మీ ఆఫీసర్ని... జాగా జలుబుగా వుంది- ఆఫీసుకి కొద్దిగా ఆలస్యంగా వస్తానని హెడ్క్లర్క్కి మెసేజ్ ఇద్దామని ఫోన్ చేశాను.... నువ్వెత్తావ్ ఫోన్.... అయినా నా ఫోన్ దగ్గర నువ్వెందుకు వున్నావ్?''

''నేను.... నేను....''

''అరుంధతికి ఫోన్ చేయాలని వచ్చివుంటావ్....''

''అవున్సార్.... నేను అరుంధతి ఫోన్ నెంబర్ డయల్ చేశాను.... అందుకే మీరు ఫోన్ మీదకి వస్తారని అనుకోలేదు....''

''నువ్వు డయల్ చేసిన నెంబర్ నీకందకుండా నా నెంబర్ నాకు అందడంవలనే నీ నిజస్వరూపం తెలిసింది.... దొంగతనంగా ఫోన్ చేయ గానే సరిపోదయ్యా.... మాట్లాడబోయే ముందు అవతల ఎవరు మాట్లాడు తున్నారో తెల్సుకోవడం మంచిది.''

''అదికాదు సార్.... సారీ సర్....''

''ఆ విషయాలన్నీ నేను ఆఫీసుకి వచ్చిన తర్వాత చెబ్దువుగాని, ముందు ఫోన్ పెట్టేయ్.''



# ఖరీదు

ఈ విషయం ముందే నీరజకి చెప్పగూడదు. హఠాత్తుగా పాకెట్టుని పట్టుకెళ్ళి ఆమె చేతిలో పెట్టి ఆనందంలో ముంచెత్తివేయాలి.

ఈ ఆలోచనతో సుధాకర్ తాను ఆ రోజు పట్టుచీర కొనుక్కొస్తున్నట్లు భార్యతో చెప్పలేదు.

నాణ్యమనిపించింది. ఆమె కట్టుకుంటే బావుంటుంది అని అనిపించింది. చీర నాల్గయిదు దుకాణాలు తిరిగిన తర్వాత కానీ కనిపించలేదు.

అప్పటికి బాగా చీకటి పడిపోయింది. తను పెట్టదల్చుకున్న దానికన్నా ఆ చీర కాస్త ఎక్కువ ఖరీదు కావడంతో అతని పర్సు ఖాళీ అయిపోయింది.

అయినా సుధాకర్ మనసు చాలా ఆహ్లాదంగా వుంది.

రేపే తమ పెళ్ళిరోజు. ఈ చీర కట్టుకుంటే నీరజ ఎంత బావుంటుందని!

అంత ఆనందంలో నీరజ వింత మనస్తత్వం చటుక్కున గుర్తుకొచ్చింది సుధాకర్‌కి.

చీరలేకాదు కూరలైనా సరే- తను ఎంత చౌకగా తెచ్చినాసరే, బేరమాడకుండా ఎక్కువ డబ్బులు తగలేసినట్లు బాధపడుతుంది. ఆమైతే మరింత తక్కువ ధరకి తెచ్చేదని, తను డబ్బు తగలేస్తున్నానని వాపోతుంది. ఈ ధాటికి తట్టుకోవాలంటే చీర ధరని కొన్న ధరకన్నా తక్కువ చెప్పాలి - తప్పదు!

నిశ్చయించుకున్నాడు సుధాకర్.

అతను ఆలోచన మధ్య ఇంటికి జేరుకునేసరికి మరో అరగంట పట్టింది.

పెందలాడే వస్తాడనుకొన్న భర్త ఆలస్యమయ్యేసరికి కోపంతో మూతి ముడిచేసి బిగదీసుకూర్చుంది నీరజ.

ఆమెనలా చూసేసరికి అతనిలోని ఉత్సాహమంతా నీరుకారిపోయింది.

చీరతప్ప తనకి అన్యధాశరణంనాస్తి. దానితోనే భార్యని చల్లబరచాలి.

''నీరజా! ఏం తెచ్చానో చూడు.'' చేతిలోని పాకెట్టుని ఆమెకి అందించబోతూ అన్నాడు సుధాకర్.

అతను వూహించినట్లు ఆమె చటుక్కున పాకెట్టుని అందుకోలేదు.

"మీ కోసం రెండు గంటల నుంచీ ఎదురుచూస్తుంటే ఇప్పుడా, మీరు వచ్చేది?'' కోపంగా అంది.

''ఆలస్యంగా వచ్చాను! కరెక్టే, ఆ అలస్యం ఈ చీరను సెలెక్ట్ చెయ్యడానికి అయ్యింది కాబట్టి, ఈ చీరని కట్టుకుని దానికి శిక్ష, నాకు కనువిందు చెయ్యి....'' చటుక్కున ఆమెచేతిని అందిపుచ్చుకుని చీర పాకెట్‌ను చేతిలో పెట్టాడు.

వెంటనే ఆ పాకెట్‌లోంచి చీరని బయటికి తీసింది నీరజ.

జరీ బోర్డరుతో కళ్ళు మిరుమిట్లు గొలిపే ఎర్రపట్టు చీర!

ఆనందంతో ఆమె కళ్ళు మెరిసాయి.

వెంటనే దాన్ని తీసి భుజాల మీదుగా వేసుకుని చూసుకుంది. ఇంతలో ఆమెకేదో గుర్తుకొచ్చింది.

''ఇంతకీ ఈ చీరని ఎంతకి కొన్నారు?'' అడిగింది భర్తని.

''అయిదు వందలు.'' వంద రూపాయలు దాని ధరలో తగ్గించి మరీ ముందు చూపుతో చెప్పాడు సుధాకర్.

నీరజ కళ్ళు చిట్లించింది. మరోసారి ఆ చీరనంతటినీ పరిశీ లించింది.

''నాల్గు వందల కంటా వుండదు. మీరు వంద ఎక్కువ పెట్టారు.' ఖచ్చితంగా అంది.

సుధాకర్‌కి వళ్ళు మండింది కోపంతో. అయినా తమాయించు కున్నాడు.

''అసలు ఆరువందలు చెప్పాడు. అరగంట బేరం చేసిన తర్వాతే అయిదువందల కిచ్చాడు.''

''మరో అరగంట బేరమాడాల్సింది-నాల్గు వందలకే ఇచ్చేవాడు'' కోపంతో ఎర్రబడ్డ అతని మొహాన్ని చూసి చిన్నగా నవ్వింది ఆమె.

అంతే! అతని కోపమంతా హూష్‌కాకి!!

''అందుకే ఏదైనా కొనదల్చుకున్నప్పుడు నన్ను కూడా మీతో తీసుకువెళ్ళమంటుంటాను. మీకు తెలీదు. వినిపించుకోరు....'' ఆ చీరని భద్రంగా పట్టుకెళ్ళి బీరువాలో బంధించింది.

సర్ప్రయిజింగ్‌గా చీరను పట్టుకెళ్ళి భార్యను ఆనంద సాగరంలో ముంచాలన్న సుధాకర్ కోరిక కోరికగానే మిగిలిపోయింది. ఇక ఆమెతో వాదించి లాభముండదు కాబట్టి ఆ టాపిక్‌ని అంతటితో కట్ చేసేసాడు.

మర్నాడుదయం సుధాకర్ నిద్ర లేచేసరికి నీరజ ఆ గదిలో కనిపించ లేదు. స్నానం చేస్తోందేమోననుకున్నాడు. కానీ బాత్‌రూమ్‌లో కూడా అలికిడి లేదు. వంటింట్లో కూడా లేదు.

గబగబా దొడ్లోకెళ్ళాడు.

పెరట్లో వున్న గోడ మీద నుంచి పక్కింటి పార్వతమ్మతో మాట్లాడుతోంది. పార్వతమ్మ చేతిలో నిన్న తను కొనుక్కొచ్చిన చీర వుంది.

"ఈ చీర ఏడువందలు పిన్నిగారూ! పెళ్ళిరోజుకని మావారు తీసుకొచ్చారు. బావుందాండీ?'' అంటోంది నీరజ.

''చాలా బావుందమ్మా!" మెచ్చుకుంటోంది పిన్నిగారు....కానీ ఆమె కళ్ళల్లో మాత్రం అనుమానం!

నేను అయిదు వందలకి తెచ్చాను అంటేనే ఎక్కువ పెట్టానని సణిగిన నీరజ ఆమెతో అ చీర ఖరీదు ఏడువందలంటోంది- ఆమె ఏమను కుంటుందోనని కూడా ఆలోచించకుండా! భార్య ప్రవర్తనకి నవ్వొచ్చింది సుధాకర్‌కి.

(కలువబాల పక్షపత్రిక)

# పెళ్లాం మనసు

ప్రతి రోజూ మధ్యాహ్నం పూట పడుకోవడం మాధవికి అలవాటు. అయినా ఆ రోజు నిద్ర పట్టలేదు. రకరకాల ఆలోచనలు .

తను మాటిమాటికి పుట్టింటికి వెళ్ళాలని పట్టుబట్టదు కదా! పొద్దున నోరు తెరిచి అడిగితే, "ఇప్పుడొద్దు"అని భర్త తేలిగ్గా కొట్టి పారేస్తాడనుకో లేదు.

ఇదీ ఆమెను పీడిస్తున్న ఆలోచన.

భర్త ఎంత ప్రేమగా చూస్తున్నా వాళ్ళు కన్న తల్లిదండ్రులు. వాళ్ళని చూడాలని తనకి అనిపించదా?

అడగలేక అడగలేక అడిగితే అంత తేలిగ్గా కొట్టి పారేస్తాడా? ఎంత సరిపెట్టుకుందామనుకున్నా ఈ తరహా ఆలోచనలు ఆమె బుర్రని తినేస్తున్నాయి.

తనెంతో ఆరాధిస్తున్న భర్త తనని చిన్న చూపు చూస్తున్నాడని మధనపడిపోతున్న ఆమె ఓ దృఢనిశ్చయానికొచ్చింది.

లాభం లేదు! భర్త అధికార దర్పానికి కళ్ళెం వెయ్యాలి!! లేక పోతే ఆయనలో నిరంకుశత్వం పెచ్చు పెరిగిపోతుంది!!!

ఇందుకు తనేం చెయ్యాలి? ఆలోచించసాగింది.

సాయంత్రం ఆయన ఆఫీసునుంచీ రాగానే తను నవ్వుతూ ఎదురెళ్ళకూడదు. అడిగిన తర్వాతే కాఫీ ఇవ్వాలి. మౌనవ్రతం పాటించాలి. పొరపాటున కూడా ఒక్క మాట కూడా మాట్లాడకూడదు- ఆయనెంత ప్రేమగా మాట్లాడినా!

రాత్రేకాదు- తెల్లవారిన తర్వాతకూడా తనదరి చేరనివ్వకూడదు. యాంత్రికంగా ఆయనకి సాయం చేస్తున్నట్లే కనిపించాలి గాని, ఆప్యాయత- అనురాగం మచ్చుకి కూడా వ్యక్తం కాకూడదు.

ఈ జాగ్రత్తలన్నీ తీసుకుంటే ఒక్క రోజుకల్లా దిగివస్తాడు. లేకపోతే ఇలా తన ఆధిక్యతను చూపుకుంటూనే పోతాడు.

మాధవి ఆలోచనలకన్నా వేగంగా టయిమ్ పరుగెత్తుతోంది!

అయిదున్నరయింది!

కృష్ణారావు ఆఫీసునుంచి వచ్చాడు.

సోఫాలో మూతి ముడుచుకూర్చున్న భార్యని చూసేసరికి అతని వుత్సాహమంతా నీరుకారిపోయింది. ఆమె ప్రక్కనే చతికిలబడ్డాడు.

అతను కూర్చోగానే ఆమె చటుక్కున లేచి నిలుచుంది.

"కోపం ఇంకా పోలేదన్నమాట?'' బూట్లలేసులు తనే విప్పుకుంటూ చిన్నగా నవ్వాడు కృష్ణారావు.

మాధవి విసవిసా లోపలికి వెళ్ళింది. కాఫీకోసం ఎదురుచూస్తున్న కృష్ణారావులో సహనం నశించింది. అయినా మాధవి వంటింట్లోంచి ఇవతలికి రాలేదు.

"రాణీగారూ! తమరు ఈ దాసుణ్ణి కనికరించాలి."తనే వంటింట్లోకి వచ్చాడు.

ఎదురుగావున్న కిటికీలోంచి బయటికి చూస్తూ నిలుచున్న మాధవి వులిక్కిపడింది.

"నాకు కాఫీ ఇవ్వబోతే ఇవ్వకపోయావ్. నువ్వయినా తాగావా?
ఫ్లాస్క్‌లోని కాఫీని ఓ కప్పులోకి వంచి ఆమెకి అందించాడు కృష్ణారావ్.

భర్త అప్యాయతకి మాధవిలోని కోపమంతా కరిగిపోయింది.

అనవసరంగా ఆయన్ని తను బాధపెడుతోంది. తనని విడి
వుండకే కదా ఆయన పంపనిది!

ఒక్క క్షణం ఆలోచించింది.

కానీ వెంటనే ఆమె అంతరాత్మ సినిమాల్లో లాగా ఎదురువచ్చి
ఎదురు తిరిగింది. తప్పక బింకాన్ని చూపించసాగింది మాధవి.

"అంతకోపమైతే నేనెంత బాధపడతానో తెలుసా?" పాటంద
కున్నాడు.

చెవులు మూసుకుని హాల్లోకి వచ్చేసింది మాధవి. ఆమె వెనుక
కాఫీ కప్పుని పుచ్చుకుని బయల్దేరాడు కృష్ణారావు.

"మీరు నావెంట తిరక్కండి. మీ పని మీరు చూసుకోండి....
మాటల్లో కోపాన్ని చూపించడానికి ప్రయత్నిస్తూ అంది మాధవి

''తమకి కాఫీ అందించడం కూడా నా పనే మేడమ్!" వినయ
విధేయతల్ని వలకబోస్తూ కాఫీ కప్పుని తనకి అందించబోతున్న భర్తని
చూసేసరికి కోపం కాస్తా పోయి నవ్వొచ్చేసింది ఆమెకి.

''వెరీగుడ్! అలా నవ్వాలి...నీకోసం ఏంతెచ్చానో చూడు''అంటూ
పాంటు జేబులు వెదకసాగాడు.

ఏం తెచ్చాడో? ఆత్రంగా భర్తని గమనించిసాగింది మాధవి.
తనంటే ఎంత ప్రేమ! కాస్త ముభావంగా వుంటే ఎంతగా తల్లడిల్లి
పోతున్నాడు!!

''ఇదిగో, ఇది...." జేబులోంచి టికెట్టుని తీసి ఆమెకి అందించాడు
కృష్ణారావ్.

"ఏమిటిది!?" ఆశ్చర్యంగా అడిగింది మాధవి ఆ టికెట్టుని అందుకుంటూ.

"మీ వూరికి టికెట్టు. రేపు రాత్రి ఎక్స్‌ప్రెస్‌కి" చిన్నగా నవ్వాడు అతను.

"ఎందుకు?" అర్థం కాలేదామెకి.

"పొద్దున. మీ ఇంటికి వెళ్ళి వస్తానని అడిగావు కదా?"

"నువ్వు వెళ్ళవద్దు. నిన్ను చూడకుండా ఒక్కరోజు కూడా వుండలేను...."అని ప్రతిమాలాడనుకున్న భర్త అలా రిజర్వేషన్ చేసుకుని మరీ వచ్చేసరికి ఆమెకి వళ్ళుమండిపోయింది.

"ఏం? నేను మా ఇంటికి వెళ్తే ఇంచక్కా మీరు మీ ఫ్రెండ్స్‌తో తిరగవచ్చని, పేకాడుకోవచ్చని ముచ్చటపడుతున్నారా? అసలు అటువంటివాళ్ళు పెళ్ళెందుకు చేసుకున్నారు?" ఆమె కళ్ళవెంట బొటబొటా నీరు కారసాగింది.

కృష్ణారావ్ అవాక్కయి పోయాడు.

పొద్దున ఇంటి కెళ్తానని అంతగా గొడవ చెయ్యబట్టే తన దగ్గర డబ్బులు లేకపోయినా ఓ మిత్రుడి దగ్గర అప్పు తీసుకుని మరీ ఆమె ప్రయాణానికి సన్నాహాలు చేసాడు. ఆనందంతో వికసిస్తుందనుకున్న భార్య ముఖం దుఃఖంతో ముడుచుకుపోయేసరికి అతని మనసు కుడితిలో పడ్డ ఎలుకలా కొట్టుకోసాగింది.

(కలువబాల పక్షపత్రిక)

# వింతరోగం

రాజారావ్ ఆఫీస్ నించీ ఇంటికొచ్చేసరికి శారద పెరట్లో గోడ మీంచి పక్కవాటా వేపు చూస్తోంది. భర్తని చూడగానే పరుగుతోవచ్చి ఫ్లాస్క్‌లోని 'టీ' కప్పులో పోసి అతని కందించింది

"ఇదిగో ...మన పక్కింట్లో ఎవరో దిగారు - చూసారా?" అంది ఆనందంగా.

"ఏ పక్కింట్లో?"

"ఆదేనండి మన పక్కవాటాలోకి"

"ఓహో....అయితే నీకు కంపెనీ దొరికిందన్నమాట....!"

"ఆవిడ్ని చూస్తే బాగా కలివిడిగా వుండేట్లేవుంది. ఇంతకు ముంద పెరట్లో పని చేసుకుంటూంటే గోడమీంచీ తనని పలకరించింది. ఇంకా సేపట్లో మనతో పరిచయం చేసుకోవడాన్కి తమ భార్యాభర్తలిద్దరు వస్తున్నామని కూడా చెప్పింది.

"ఇప్పుడా?"

"అవును."

"అలాగైతే ముందు మనం రెడిగా వుండటం మంచిది. ఇంతకు వాళ్ళకి పిల్ల, పాపా ఎవ్వరూ లేరా?"

"ఊహూం .... వాళ్ల పెళ్లీమధ్యనే అయిందిట. మీరే పేపర్ పుచ్చుకుని తిరగేస్తుండండి. నేనేదైనా టిఫినేర్పాటు చూస్తుంటాను....'

వంటింట్లో కెళ్ళిపోయింది శారద. ఎదురుగా టీపాయి మీదున్న ఓ వీక్లీ సందుకు నక్కడే కూలబడ్డాడు రాజారావ్.

'వాళ్ళొచ్చేసరికల్లా టిఫిన్, కాఫీ సిద్ధం చెయ్యాలి' - చకచకా ఆ పన్లు పూర్తిచేసుకో సాగింది శారద. ఆమె ఆలోచన్లు మాత్రం పక్కవాటా దంపతుల చుట్టూనే తిరుగుతున్నాయ్.

ఆమెకిలాగానే అతన్లో కూడా హుషారు పాలెక్కువేనేమో! ఇహ వచ్చిరాగానే ఇద్దరూ గడగడా మాట్లాట్టం ప్రారంభిస్తారేమో!

హఠాత్తుగా ఆమెకి నెల్రోజుల్నాడు తామిద్దరూ కపర్ది ఇంటికెళ్ళి నప్పటి సంగతి గుర్తుకొచ్చింది.

కొత్తగా కాపురం పెట్టిన సందర్భంలో తామిద్దర్నీ వాళ్ళింటి కాహ్వానించాడు కపర్ది. కపర్ది రాజారావ్‌కున్న ముఖ్యహితుల్లో ముఖ్యుడు!

ఆరోజు తనెంతో చనువుగా ప్రవర్తించింది వాళ్ళతో. అంతే! తిరిగి ఇంటికి వచ్చేసరికి పెద్ద దుమారం!

'ఇవాళేకదా వాళ్ళతో పరిచయమైంది. సిగ్గు లేకుండా వాళ్ళ ముందలా తెగవాగడాని కర్థం వుండొద్దూ? ఆవిడ చూడు - ఎంత అణకువగా, ముచ్చటగా ఎలావుందో! అక్కడున్నంతసేపూ నీ ప్రవర్తనకి సిగ్గుపడి చచ్చిపోయాను మళ్ళీ ఎవరితోనైనా ఇలా ప్రవర్తించావంటే బావుం డదు - ముఖ్యంగా మొగాళ్ళ ముందు....' ఇష్టంవచ్చినట్లు దులిపేసాడు రాజారావ్. ఆపూట అన్నంకూడా తినకుండా బాధపడింది.

వాళ్ళముందు కాస్త మితంగా మాట్లాడలేకపోతే మళ్ళీ లేనిపోని గోల....

ఇలా ఆలోచిస్తూనే రాబోయే అతిథుల కోసం టిఫిన్, కాఫీ సిద్ధం చేసేసరికి అరగంట పట్టింది. ఈ అరగంటలోనూ ఒకవేళ వాళ్ళొచ్చే

సారేమోనన్న అనుమానంతో ఏ నాలైదుసార్లో హాల్లోకెళ్ళి తొంగి చూసొచ్చింది. ఆమె వంటింటి పని పూర్తి చేసుకుని హాల్లోకి రావడం, వాళ్ళు గుమ్మంలోకి అడుగు పెట్టడం ఒకేసారి జరిగింది.

''వాళ్ళొచ్చేసారండి....'' వాళ్ళని చూస్తూనే గబగబా భర్త దగ్గర కొచ్చి నెమ్మదిగా చెప్పింది శారద.

''రండి....రండి ...'' చటుక్కున చేతిలో వున్న పుస్తకాన్నెదురుగా వున్న టీపాయ్ మీద పడేసి, లేచి వాళ్ళ నాహ్వానించాడు రాజారావ్.

''నా పేరు ఈశ్వర్. ఈమె నా భార్య - మయూరి. మీ ప్రక్క వాటాలో కివాళే అద్దెకి దిగాం....'' తమని పరిచయం చేసుకుంటూ అన్నాడతను.

"మీ మగవాళ్ల పరిచయా లిప్పుడవుతున్నాయిగాని,మా పరిచయా లెప్పుడో అయ్యాయ్!'' శారదవేపు చూసి చిన్నగా నవ్వుతూ అంది మయూరి.

జవాబుగా తనూ చిన్నగా నవ్వి లోపలి కెళ్లబోయింది శారద.

''ఏఁవండోయ్! మీరు కాఫీ, టిఫిన్లాంటి ప్రయత్నాలేమీ చెయ్యొద్దు. ఇప్పుడే ఆ కార్యక్రమాలన్నీ పూర్తి చేసుకుని వస్తున్నాం. కాసేపు మీరు కూడా వచ్చి ఇలా కూర్చున్నారంటే సరదాగా కబుర్లు చెప్పుకుందాం.'' సోఫాలో భర్త పక్కనే కూలబడుతూ చటుక్కునాగి శారదతో అంది మయూరి.

''అలాగేలెండి....'' ఆమె పిలుస్తున్నా కూడా వినిపించుకోకుండా లోపలికెళ్లిపోయింది శారద.

''మా పెళ్లై ముచ్చటగా మూడు నెలలైంది. ఈమె కాపురాని చ్చేమో ఇంకా నెలకూడా కాలేదు. అప్పుడే ఇది రెండో ఇల్లు!'' రాజా వ్‌తో చెప్తూ మయూరి వేపు చూసి నవ్వాడీశ్వర్.

''ఇంతకు ముందు మీరొక్కరే కాబట్టి ఆ ఒంటి గదిలో వుండ బిగేవారు. ఇద్దరికి ఆ రూమెలా సరిపోతుంది? అందుకే వెంటనే మరో ల్లు చూడమని చెప్పాను. తప్పాండీ?'' రాజారావునే సూటిగా ప్రశ్నిం ంది మయూరి.

''అబ్బే.... తప్పెందు కవుతుంది....?'' ఏమనాలో తెలీక గబు క్కునసేశాడు రాజారావ్.

''మరిప్పుడు చూడండి - ఇళ్లు మారడం నా హాబీ అయినట్లు మాట్లా ంతున్నారు!'' భర్తమీద ఫిర్యాదు చేసింది.

''ఇళ్లు మారడం కాదు నీ హాబీ-మొగుడితో పోట్లాడడం....''

''సర్లెండి-ఏదో ఒకటి! మనం ఇక్కడి కొచ్చింది వాళ్లతో పరి యం చేసుకోడానికి గాని, మన కీచులాటలు వాళ్లముందు ప్రదర్శించ ానికాదు.''

ఇంతలో టిఫిన్ ప్లేట్ల 'ట్రే'తో హాల్లోకొచ్చింది శారద.

"ఏమిటండీ ఇదంతా! మేమొస్తున్నట్లు ముందే చెప్పడం తప్పయి ోయిందనుకుంటానే!" టిఫిన్ ప్లేట్లని వాళ్ళ ముందున్న టీపాయ్‌మీద ర్దుతున్న శారదని చూసి నొచ్చుకుంటూ అంది మయూరి.

''అబ్బే....ఏంలేదు....'' మొహమాటంగా జవాబిచ్చింది శారద.

''ఏం లేదంటారేమిటండీ - స్వీటు, హాటు రెండూ తీసుకొచ్చి మా యందు పడేసి!'' వచ్చినప్పట్నించీ ఎంతో సరదాగా అలా గలగలా ాట్లాడేస్తున్న మయూరిని చూస్తుంటే రాజారావ్‌కి ముచ్చటేస్తోంది.

"పర్లేదు తీసుకొంటె...." అన్నాడామె వేపుచూసి నవ్వుతూ.

"మరి మీకు?" మూడు ప్లేట్లు తెచ్చి వాళ్ళ ముగ్గురి ముందూ సర్ది, తనెళ్ళి లోపలి గుమ్మం దగ్గర నిలబడ్డ శారద నాశ్చర్యంగా చూస్తూ అడిగాడీశ్వర్.

"తర్వాత తీసుకుంటాలెండి...." సిగ్గుపడిపోయి జవాబిచ్చింది దామె. ఆమె అణకువ, నమ్రత, మిత సంభాషణం - ఎంతో ఆకర్షించాయ్ ఈశ్వర్‌ని. తనకి తెలీకుండానే ఆమెని తన భార్యతో పోల్చుకోసాగాడు. ఇద్దరి మధ్యా వ్యత్యాసం!

"పోనీ....రండి.... ఇలా వచ్చి కూర్చోండి. అక్కడ నిలబడ్డా రెందుకు?" నవ్వింది మయూరి.

"పర్లేదులెండి...." అక్కడ్నించి కదలకుండానే జవాబిచ్చింది శారద. మయూరి ఆశ్చర్యంతో ఒకసారి ఆమెని, రాజారావ్‌ని మార్చి చూసింది. రాజారావ్‌కి పరిస్థితి ఇబ్బందికరంగా తయారైంది. అతనికి శారద మీద విపరీతమైన కోపం వచ్చింది.

"రా శారదా! ఇలావచ్చికూర్చో." బలవంతాన కోపాన్నణచుకుంటూ అన్నాడు.

"మీరు మాట్లాడుతూండండి. ఇప్పుడే వస్తా...." అని లోపలి కెళ్ళిపోయింది శారద. ఆమె ప్రవర్తన మయూరికెంతో వింతగా వుంది. తమ ముందుకు రావడానికే ఆమె అంత సిగ్గెందుకు పడుతోందో అర్థం కాలేదు. ఒకవేళ తనందాన్ని చూసి ఈశ్వర్ వెనకబడతాడని భయమా? లేకపోతే రాజారావ్‌కి అనుమానం జబ్బుందా?....

మౌనంగా టిఫిన్ తినసాగింది.

టిఫిన్ తినగానే కాఫీలు తెచ్చి యిచ్చి మళ్ళా లోపలిగుమ్మం గడప దగ్గర కెళ్ళి నిలబడింది శారద.

"అన్నట్లు రేపు రాత్రికి మా ఇంట్లోనే మీ ఇద్దరి భోజనం." హఠాత్తుగా అంది మయూరి.

"ఎందుకూ?" ఆశ్చర్యంగా అడిగాడు రాజారావ్.

"రేపు నా బర్త్‌డే ..." సిగ్గుపడిపోతూ అందామె.

"భారీ ఎత్తునేర్పాట్లు చేసాం కార్యక్రమాల్ని" గట్టిగా నవ్వుతూ అన్నాడీశ్వర్.

"భోజనం కాకుండా ఇంకా ఏమైనా కార్యక్రమాలున్నాయా?" అడిగాడు రాజారావ్.

"భోజనాలు కాగానే కాసేపు కబుర్లు. తర్వాత సినిమా సినిమా కూడా వస్తున్నారు మీరు మాతో!" ఖచ్చితంగా అంది మయూరి.

అంత తొందర్లోనే అంతగా కలిసిపోయే మయూరి మనస్తత్వానికి ముగ్ధుడైపోయాడు రాజారావ్. ఆమె హుషారుని చూస్తుంటే అతనిలో కొత్త హుషారు పుట్టుకొస్తోంది.

"భోజనానికైతే ఫర్లేదుకాని సినిమా అంటే మా హోండిపార్ట్‌మెంట్ పర్మిషన్ ముందు తీసుకోవాలి మీరు" శారదవైపు తిరిగి నవ్వుతూ అన్నాడు రాజారావ్.

"ఏం? మీకు సినిమాలు చూట్టం ఇష్టం లేదా?" శారద నడిగింది మయూరి.

"పెద్దగా ఇష్టం లేదండి...." సిగ్గు పడిపోతూనే నెమ్మదిగా జవాబిచ్చింది శారద.

"ఇష్టముండి మాత్రం లాభమేంటి లెండి? మన ఆడవాళ్ళకి స్వాతంత్ర్య మెక్కడుంది గనక! మగవాళ్ళ అభిరుచుల్ని బట్టి మారాల్సిందేగా! నా మట్టుకు నన్ను చూడండి, నాకు సినిమాలు చూట్టమంటే ఎంతో

ఇష్టం. మా వారికి సినిమాలంతగా గిట్టవ్ అంతే! పెళ్ళయిన తర్వాత నేను కూడా సినిమాలు చూట్టం తగ్గిపోయింది." ఈశ్వర్ వేపు చూసి నవ్వింది.

''సరిపోయింది, మళ్ళీ ప్రారంభించాక్ నామీద పడవయ్యాత్ర?''

''మరేం భయపడవాకండి. ఇప్పుడు నకంత ఓపిక లేదు. ఇందాక మేం చెప్పిన ప్రోగ్రామ్‌ని ఫిక్స్ చేశామండి. మీరిద్దరూ కాదనడానికి వీల్లేదు. మరి మళ్ళీ రేపొస్తాం. ఇంకా ఇంట్లో ఎక్కడిసామాను అక్కడే వుంది. సర్దుకోవాలి. వస్తాం.'' లేచి నిలబడింది మయూరి.

"అలాగే! రేపు రాత్రికి మేం మీ అతిథులం. మీరేరకంగా మర్యాదలు చేసినా స్వీకరించ గలవారం.'' నవ్వుతూ అన్నాడు రాజారావ్.

"థాంక్ యూ ..." మయూరి, ఈశ్వర్ వాళ్ళ వాటాలోకి వెళ్ళిపోయారు.

"నీకు మరీ మంచీ మర్యాద తెలీకుండా పోతున్నాయ్." వాళ్ళు వెళ్ళగానే భార్యవేపు కోపంగా చూస్తూ అన్నాడు రాజారావ్.

''నేనేం చేసేనండీ?'' అతని కోపం అర్థంకాక ఆశ్చర్యంగా అడిగింది శారద.

''ఏం చేశావా? ఇంటి కెవరైనా వస్తే వాళ్ళతో కాస్త సరదాగా మాట్లాటం కూడా తెలీదా? సిగ్గులొలకపోస్తూ పోయి అక్కడెక్కడో నిలబడతావేం- నేనేదో నిన్ను గిరిగీసి నిలబెట్టినట్లు! ఛీ ఛీ-చదువుకుంటే సరిపోదు, సంస్కార ముండాలి. ఆమెతో నిన్ను పోల్చి చూసుకుంటూ సిగ్గుతో చచ్చిపోయాను....'' అతని మాటలకి కోపం రాలేదు, నవ్వొచ్చింది శారదకి

"ఆ రోజున సరదాగా మాట్లాడితే తప్పు అన్నారు. ఈ రోజున కాస్త ముభావంగా వుంటే మిమ్మల్నేదో అవమానపరిచినట్లు మాట్లాడుతున్నారు! ఎలా ప్రవర్తించినా తప్పే. ఏం మగాళ్ళో!" మారు మాట్లాడకుండా టిఫిన్ తిన్న ప్లేట్లు, గ్లాసులు పుచ్చుకొని పెరట్లోకి వెళ్ళిందల్లా ప్రక్క వాటాలోంచి ఈశ్వర్ మాటలు వినబడుతుంటే నిలబడిపోయింది.

"ఇవాళేకదా వాళ్ళతో పరిచయమైంది? సిగ్గూ ఎగ్గూ లేకుండా వాళ్ళతో అంతగా వాగేయడానికి అర్థముండద్దూ? చూడు, ఎంత అణకువగా ఎలా వుందో ఆవిడ! అక్కడున్నంతసేపూ నీ ప్రవర్తనకి సిగ్గుతో చచ్చాను. మళ్ళీ ఎవరి దగ్గరైనా ఇలా ప్రవర్తించావంటే బావుండదు. ముఖ్యంగా మొగవాళ్ళ ముందు...."

'హుఁ.... వీళ్ళదెంతో ముచ్చటైన దాంపత్యమనుకున్నాను. వీళ్ళ దాంపత్యంలోకూడా ఈ ఏంతరోగం పట్టిందన్నమాట!' చిన్నగా నిట్టూర్చి తన పన్లో మునిగిపోయింది శారద.

# కథకాని కథ

నెంబర్ 'త్రీ' బస్‌కోసం ఎదురుచూస్తూ శంకరమఠం దగ్గర నిలబడ్డాను.

అలా అక్కడ నిలబడి బస్‌కోసం ఎదురుచూట్టం ప్రారంభించి అప్పటికి ఇరవై నిముషాలు దాటిపోయింది. బస్సులు వస్తున్నై, పోతున్నై. కానీ వాటిలో మూడోనెంబరు మాత్రం వుండటంలేదు. వెళ్తే ఒకదానివెంటే మరొకటి రెండో, మూడో వెళ్తాయి! లేకపోతే ఏ అరగంటదాకానో ఒక్క బస్సూ వుండదు!

ఆ రోజు ఆదివారం కావడంవల్ల మారేడ్‌పల్లిలో వున్న మా పెద నాన్నా వాళ్ళింటికి వెళ్దామని బయల్దేరాను.

ఉద్యోగరీత్యా నేను హైద్రాబాద్ వచ్చి హోటల్ భోజనం, రూమ్ నిద్ర ప్రారంభించి రెణ్ణెల్లు దాటుతోంది. అయినా ఇంతవరకూ పెద్ద చెప్పుకోతగ్గ పరిచయాలేమీ ఏర్పడలేదు. బంధువులు కూడా ఈ జంట నగరాల్లో మా పెదనాన్నావాళ్ళు తప్ప మరెవ్వరూ లేరు. మా పెదనాన్నకి కొడుకుల్లేరు! ముగ్గురూ కూతుళ్ళే! అందరూ చాలా సరదాగా వుంటారు. వాళ్ళింటికెళ్తే మంచి కాలక్షేపం. అందుకని ఆఫీసుకి శెలవొచ్చిందంటే, ఉదయం భోంచేయగానే వాళ్ళింటికి వెళ్తాను.

మాలతీ ంత మా పెదనాన్న పెద్ద కూతురు. అది చాలా బాగా పాడుతుంది. కాసేపు దాని పాటలు వినడం, తర్వాత అందరంకల్సి

బుర్లు చెప్పుకోవడం, ఇంకా టైముంటే అలా బయటి కెక్కడికైనా షికారు కెళ్ళడం. ఇలా చాలా సర్దాగా గడిచిపోతుంది. రాత్రి భోజనాలు కాగానే తిరిగి రూమ్‌కి బయల్దేరతాను. రొటీన్ లైఫ్ మధ్య అదో పెద్ద రిలీఫ్!

విసుగ్గా వాచీ వంక చూసుకున్నాను.

పన్నెండుంబావ్!

ఎక్కడా బస్సొస్తున్న జాడలేదు.

ఎండ నిప్పులు చెరుగుతోంది.

వేడిగాలి సుళ్ళు తిరుగుతోంది.

చెమటతో లోపలి బనీను, చొక్కా చాలా భాగం తడిసిపోయింది.

చిరాకేస్తోంది!

ఒక్క క్షణం — 'ఆటోలో వెళ్ళిపోతే?' అన్పించింది. కానీ ఇంత సేపూ వెయిట్ చేసి ఆటోలో ఎక్కగానే వెనకే బస్సొస్తే, ప్రాణం వుసూరు మంటుంది. అందుకని ఆ ప్రయత్నాన్ని విరమించుకొని బస్‌కోసం వెయిట్ చేస్తూ నించున్నాను. రకరకాల ఆలోచన్లు ఈగల్లా మనసుని ముసర సాగాయి.

లత, పద్మ, జయ, పెదనాన్న, అమ్మ - అంతా ఇంకా ఎందుకు రాలేదోనని ఎదురుచూస్తుంటారు. అసలు పెదనాన్నకి నేనిలా రూమ్ తీసుకుని ఒంటరిగా వుండటం ఇష్టంలేదు.'వచ్చేసి మాతో పాటే వుండరా!' అంటాడు.

'నువ్వు డబ్బులిస్తే వాడు తీసుకోడు. ఏమీ ఇవ్వకుండా ఎన్నాళ్ళని అక్కడుంటావ్?' అంటారు నాన్నగారు.

అందుకనే ముందు ఓ వారం రోజులు వాళ్ళింట్లో వున్నా, తర్వాత ఓ రూమ్ చూసుకుని నల్లకుంట వచ్చేశాను.

''ఎక్స్‌క్యూజ్ మి!'' పలకరింపుతో ఆలోచనల్లోంచి బయటపడి పక్కకి చూశాను.

బహుశా అతనికీ నా వయసే వుంటుంది. ఇరవైనాలుగేళ్ళుం డొచ్చు! పెరిగిన గడ్డం, నలిగిన గుడ్డలు, మొహంలోని దైన్యం - అతని స్థితిని చెప్పకనే చెప్తున్నాయ్!

''మీరు వేరేగా అనుకోకపోతే....'' నసిగాడు.

ఏదో చెప్పాలనుకున్నట్లుంది. చెప్పడానిక్కి తటపటాయిస్తున్నాడు.

అతన్ని చూస్తుంటే అతని పరిస్థితి అర్థమవుతూనే వుంది. ఆర్థిక సహాయం కోసం వచ్చుంటాడు. కాకపోతే అతన్లో మరుగుపడిపోతున్న సంస్కారం తాలూకు మొహమాటం అడ్డు పడుతున్నట్లుంది. అందుకనే అడగలేకపోతున్నాడు. అతని అవస్థ చూస్తుంటే బాధేసింది.

''పర్లేదు చెప్పండి'' అన్నాను.

''మాది తెనాలి. అక్కడే బి.యస్.సి. చదువుకున్నాను. చదువు కోవడమైతే నావల్లయింది కాని, ఉద్యోగం సంపాదించడం నా వల్ల కాలేదు. రోజులు సంవత్సరాలుగా మారిపోతున్నాయి. రోజుల్తోపాటు అందరికీ-చివరికి మా ఇంట్లోవాళ్ళక్కూడా నా మీద అభిమానం పూర్తిగా కరిగిపోయి, అసహ్యం చోటు చేసుకోసాగింది. నన్ను, నా బాధని అర్థం చేసుకునేవాళ్ళే కరువయ్యారు. అందరూ సూటిపోటి మాట లనడం ప్రారంభించారు. ఇక అక్కడుండలేక కట్టుబట్టల్తో,సర్టిఫికెట్లతో ఇక్కడికి వచ్చేశాను. ఏదైనా ఉద్యోగం దొరికి, నా కాళ్ళ మీద నిలబడ్డప్పుడే తిరిగి వెళ్ళాలనుకున్నాను. ఆత్మాభిమానంతో వచ్చేయడమైతే వచ్చేశానుగాని, ఇక్కడా నాకుద్యోగం దొరికే ప్రాప్తం కన్పించడంలేదు. మూడు రోజుల్నించీ కన్పించిన ప్రతి ఆఫీసుకీ వెళ్తూనే వున్నాను. కానీ ఫలితం శూన్యం.' వో నిట్టూర్పు వదిలి తిరిగి చెప్పడం ప్రారంభించాడు:

''భోంచేసి రెండు రోజులైంది. నీర్సంగా వుంది ప్లీజ్! నన్నర్థం చేసుకుని ఏదైనా సహాయం చేయండి.''కర్చీఫ్‌తో కళ్ళు తుడుచుకున్నాడు.

అతన్నలా చూస్తుంటే విపరీతమైన బాధేసింది.

వో అర్ధరూపాయి అతనికిద్దామనిపించి జేబులోకి చెయ్యిపోనిచ్చాను.

అతను ఆశగా నా వంకే చూస్తున్నాడు.

'పాపం! అన్నం తిని రెండురోజు లైందిట. నే నర్ధరూపాయిస్తే మాత్రం లాభమేంటి?అతను తింటానికేదైనా ఇప్పిస్తే బావుం'దనిపించింది.

''నాతో రండి.'' అతన్తో అంటూ ఎదురుగా వున్న స్వీట్‌షాపువేపు దారితీశాను. అతను నా వెంటే నచ్చాడు.

రెండు రకాల స్వీట్లు తెప్పించాను.

అతను ఆవురావురంటూ తినేశాడు.

పాలు తెప్పించాను.

అతను పాలను త్రాగుతుండగా 'త్రీ' వచ్చింది.

''మీరు నెమ్మదిగా తాగి వెళ్ళిపోండి. నేను బిల్లు చెల్లించి వెళ్తున్నాను'' గబగబా కౌంటర్ దగ్గరికెళ్ళి బిల్లు చెల్లించి బస్‌కేసి పరుగెత్తాను.

నేను వెళ్ళేసరికి బస్ వెళ్ళిపోయింది.

దాదాపు - అరగంటనించీ బస్‌కోసం వెయిట్ చేస్తున్నాను. తీరా బస్సొచ్చినా అందుకోలేకపోయాను. తర్వాతి బస్ మళ్ళీ ఎంతసేపటికొస్తుందో!

ఆ ఎండలో అక్కడ నిలబడలేక తిరిగి స్వీట్‌షాపు దగ్గరకొచ్చాను.

అప్పుడే అతడు బయటకొచ్చాడు.

''దాదాపు అరగంటనించీ బస్‌కోసం వెయిట్ చేస్తున్నాను. చివరికి వచ్చింది కాని మిస్సయ్యాను'' అన్నానతన్తో.

''మంచి శాస్తే జరిగింది!'' అన్నాడతను నవ్వుతూ.

అతని నవ్వులో ఓ విధమైన ద్వేషం కనిపించింది. ఆశ్చర్యంగా **అతనివేపు** చూశాను.

''లేకపోతే ఏమిటి? నేను నా గొడవంతా చెప్పకొని, ఆకలిగా వుందని ప్రాధేయపడితే, మీకు నా మీద ఏమాత్రం నమ్మకం కలగలేదు. అందుకే నాకు డబ్బు లియ్యకుండా మీరే తీసుకెళ్ళి తినిపించారు. ఎదుటి మనుష్యుల్ని సరిగా అర్థం చేసుకోని మీలాంటివాళ్ళకిలాగే జరుగుతుంది'' అనేసి చరచరా వెళ్ళిపోయాడతను.

మరో మూడోనెంబరు బస్సు నా ముందు వచ్చి వెళ్ళిపోయినా కదలకుండా అక్కడే నిలబడిపోయాను.

(ఆంధ్ర సచిత్ర వారపత్రిక)

# బంధం-సంబంధం

రాజారావు ఆఫీసుకి వెళ్ళడానికి ముందుగదిలో బూట్లు వేసుకొంటూ వుంటాడు. కర్చీఫ్, పెన్ను భర్తకి అందించడానికి అక్కడికి వచ్చిన శారద వాటిని భర్తకివ్వడం మరచిపోయి, ఎదురు వాటాలోంచి వినిపించే మాటల్ని వింటుంది.భార్య అన్యమనస్కాన్ని గమనించి రాజారావు కూడా ఎదురింటివైపు తన దృష్టిని మరలుస్తాడు.

ఎదురింట్లో–ఈశ్వర్ ఆఫీసుకి బయల్దేరడానికి సిద్ధమవుతాడు. కానీ బాగ్‌నందించడానికి వచ్చిన భార్యని చూసి ఆఫీసుకిపోనని భీష్మించు క్కూర్చుంటాడు. "ఉహు .. ఇవాళ నేను ఆఫీసుకెళ్ళను. నీ దగ్గరే వుండి పోతా." ఈశ్వర్ గారాం పోతున్నాడు.

"బావుంది. ఆఫీసుకెళ్ళకుండా ఎవరైనా పెళ్ళాం కొంగు పట్టుకు తిరుగుతారేమిటి?" అంటోంది భార్య.

"అందరి సంగతి వేరు - నా బంగారు బొమ్మ సంగతి వేరు. నీకున్న అందం ఎంతమందికుంటుంది?"

"మీరు మాత్రం సినిమా హీరోలా లేరూ?"

ఇద్దరి నవ్వులు విరుస్తాయి. మయూరి, ఈశ్వర్ని బలవంతాన ఆఫీసుకి బయల్దేరదీస్తుంది. వాళ్ళు బయటికి రావడంతో వులిక్కిపడి భార్య చేతిలోంచి కర్చీఫ్, పెన్ను లాక్కుంటాడు రాజారావ్. వెనక్కి తిరిగి బైబై చెప్తూ వెళ్తాడు ఈశ్వర్. అతని వెనుకే భార్యకి వెళ్తున్నానని కూడా

చెప్పకుండా బయల్దేరతాడు రాజారావు. అతను తనకి బైబై చెప్తాడని ఆశగా గుమ్మంలోకి వచ్చిన శారదకి నిరాశ ఎదురవ్వడమే కాకుండా మయూరి తనని గమనించనుకూడా గమనించకుండా భర్తకు టాటా చెప్తూ చేతులు చూపుతూ నిల్చోవడం బాధని కలిగిస్తుంది. చటుక్కున లోపలికి వచ్చేస్తుంది.

* * *

సరిగా ఆయిదున్నర కొట్టేసరికల్లా ఈశ్వర్ ఇంటికొచ్చి కాలింగ్ బెల్ మోగిస్తాడు. వాళ్లు లోపలికి వెళ్ళిపోగానే శారద గుమ్మంలోకి వచ్చి నిల్చుని భర్తకోసం ఎదురుచూస్తుంటుంది. రాజారావ్ వస్తున్న జాడ ఎక్కడా లేదు. ఇంతలో ఎదురు వాటా తెలుపు తీస్తున్న శబ్దం. లోపలికి వచ్చి కర్టెన్ సందుగుండా చూస్తుంటుంది. ఇంటికి తాళం వేసి ఇద్దరూ చిలకా గోరింకల్లా బయటికి వెళ్ళిపోతారు. విసుగ్గా కుర్చీలో కూలబడు తుంది ఓ వీక్లీని అందుకుని శారద. ఇంతలో కాళ్ళీడ్చుకుంటూ వస్తాడు రాజారావు. అతడిని చూడగానే లోపలికి వెళ్ళి మంచి నీళ్లు తెచ్చిస్తుంది శారద. "ఏమండీ, కాస్త ముఖం కాళ్లు, చేతులు కడుక్కుని వచ్చారంటే కాఫీ ఇస్తాను. ఆ తర్వాత ఇద్దరం కలిసి అలా బైటికి వెళ్దాము." అడిగింది శారద.

"ఇప్పుడేగా ఇంటికి చేరింది? ఇప్పుడు మళ్ళీ బయటికి బయల్దేరే ఓపిక నాకు లేదు." రాజారావు అన్నాడు.

"అలా ఎగ్జిబిషన్ వైపు వెళ్ళి వద్దామండీ!"

'శారదా! ఇప్పుడు నన్ను ఇబ్బంది పెట్టకు,బయటికి కదలలేను." బ్రతిమాల్తున్నట్లన్నాడతను. మూతి తిప్పుతూ లోపలికి వెళ్ళిపోతుంది శారద. రాజారావు నీరసంగా వెనక్కి వాల్తాడు కుర్చీలో.

* * *

మర్నాడు వీళ్లు ముందు గదిలో వుండగానే ముందింట్లోంచి ఈశ్వర్, మయూరి బయటికొస్తారు. లోపలనుంచే వాళ్ళ మాటల్ని వింటుంటారు. "సాయంత్రం ఆఫీసైపోగానే వచ్చేస్తారుకదూ?" అడిగింది మయూరి.

"అయిదున్నరకల్లా రెక్కలు కట్టుకొనివచ్చి నీముందు వాల్తాను." వినమ్రాన్ని చూపిస్తూ అన్నాడు ఈశ్వర్. టాటాలు చెప్పుకుంటూ విడిపోతారు. ఎదురు గుమ్మం తలుపు వేసుకున్న తరువాత రాజారావు బయల్దేరతాడు. వెనకే బయటికి వచ్చిన శారద అడిగింది:

"సాయంత్రం అయిదున్నరకల్లా వచ్చేస్తారుగా?"

"ఇంకా నయం! ఆఫీసుకి శెలవు పెట్టి ఇంట్లో వుండిపొమ్మన్నావు కాదు. ఆఫీసులో బోల్డు పనుంది ఈ రోజు కాస్త ఆలస్యం కావచ్చు." రాజారావు కాస్త విసుగ్గా అన్నాడు.

రాజారావు వెళ్ళిపోతాడు. శూన్యంలోకి చూస్తూ అక్కడే నిల్చుండిపోతుంది శారద.

*　　　*　　　*

శారద, మయూరి ఇంట్లో లోపలి గదిలో మాట్లాడుకుంటూ వుండగా కాలింగ్ బెల్ మోగుతుంది. దూక్కుంటూ వచ్చి తలుపు తీస్తుంది మయూరి. భర్తను చూస్తూ అడిగింది:

"ఏమిటండీ అలా వున్నారు?"

"రేవు సాయంత్రం కాంప్ కెళ్ళాలి."

"ఎన్నాళ్ళు?"

"నాలుగు రోజులు."

"అమ్మో! నాల్గురోజులే. నేను వంటరిగా వుండలేనండీ! మీతో వచ్చేస్తాను."

"నేను అదే అనుకుంటున్నాను. నిన్నొదిలి నేను మాత్రం వుండ గలనా? ఇద్దరం కలిసి వెళ్దాం. ఏదైనా హోటల్లో దిగుదాం. పగలల్లా ఆఫీసు సేవ, సాయంత్రం దేవిగారి సేవ "

"అలా చేస్తే ఆఫీసు పని మీద వెళ్ళినట్లే వుండదు. ఇంచక్కా హనీ మూన్ వెళ్ళినట్లుంటుంది."

ఇద్దరూ నవ్వుకుంటారు.

"ఇప్పుడెక్కడికైనా వెళ్దామా - ఏ సినిమాకైనా?" మయూరి అడిగింది.

"సినిమాకా? నే్రానను." ఈశ్వర్ అలక నటిస్తాడు.

"ఏం?"

మూడు గంటలసేపు నువ్వు నా ప్రక్కనున్నా వంటరితనాన్ని అనుభవిస్తూ కూర్చోలేను."

ఆమెని దగ్గరికి తీసుకోబోతాడు.

ముక్కుమీద వేలుంచి దూరంగా జరుగుతుంది.

"ష్.... శారదగారు లోపల గదిలో వున్నారు." భర్తని వారిస్తుంది మయూరి.

బుద్ధిమంతుడిలా సోఫాలో కూర్చుండిపోతాడు ఈశ్వర్.

మయూరి లోపలికి రాగానే శారద "మావారొస్తారు. నేను వస్తా నండీ...." లేస్తుంది.

"కాఫీ తాగి వెళ్దురుగాని." మయూరి అడిగింది.

"వద్దంతీ, ఆయన వచ్చే టైమైంది."

శారద వెళ్ళిపోతుంది.

"శారదా! ఇటురా...." కేకేస్తాడు ఈశ్వర్.

"నాకు చాలా పనులున్నాయి."

"ఇద్దరం కలిసి ఆడుతూపాడుతూ పని చేస్తుంటే...."

కాఫీ కప్పుతో వస్తూ మయూరి "స్వామీ, కాస్త మీ పాట ఆపండి. ఆడుతూ పాడుతూ ఇప్పుడేమీ పనిచేయనక్కర్లేదు. మీరు ఆఫీసునించి వచ్చేసరికే నేను పనంతా పూర్తి చేసుకున్నాను. ఈ కాఫీ తాగండి చాలు." బ్రతిమాల్తున్నట్లంటుంది.

"ఏమిటీ, నేనొక్కణ్ణేతాగాలా? వన్‌బైటు ప్లీజ్...." లాలనగా భార్యనడుగుతాడు ఈశ్వర్. అతని ప్రక్కన కూర్చుండిపోతుంది.

"ఒకే. గ్రాంటెడ్."

కాఫీ కప్పుని మయూరికి అందిస్తాడు. "లేడీస్ ఫస్ట్. ఫస్ట్ సిప్ నీది" అంటాడు ఈశ్వర్. ఆమె సిప్ చేస్తుంది.

* * *

రాజారావు వచ్చేసరికి శారద చికాకుగా వుంటుంది. "ఏమిటలా వున్నావు? ఆలస్యంగా వచ్చాననా?" అడిగాడు రాజారావు.

"ఈవిడకి భర్త ఇంటికొస్తే చాలు ఇంకెవ్వరూ గుర్తుండరు." చిరు కోపంతో అంటుంది శారద.

"వీళ్ళ అన్యోన్యం చూస్తుంటే ఆఫీసులో వున్నంత సేపు ఎలా విడి విడిగా వుండగల్గుతున్నారా అనిపిస్తుంది."

"ఇంట్లో వున్నా భర్తధ్యాసే. నాతో నాలుగు మాటలు మాట్లాడిం దంటే అందులో రెండు భర్త గురించె. ప్రతిరోజూ అతనికోసం ఆఫీసుకి ఫోన్ చేస్తుంది అతనొకసారి ఫోన్ చేస్తాడట."

"ఆదర్శదాంపత్యం........" ముచ్చటపడతాడు రాజారావు.

* * *

ఆఫీసునుంచి వస్తూనే భార్యని గట్టిగా పిలుస్తాడు రాజారావు. "ఏమిటా కేకలు?" అంటూ ఆక్కడికొస్తుంది శారద.

"ఇలా కూర్చో, ఇవాళ నా మూడ్ పాడైపోయింది."

"నాకూ అలానే వుందండీ!"

"సరిపోయింది. కారణమేమిటి?"

"ముందు మీ మూడ్ పాడవడానికి కారణం చెప్పండి,"

"ప్రొద్దున అతని వెనుకే ఆఫీసుకి బయల్దేరానా? దారిలో అతనికో స్నేహితుడు కలిసాడు...." అంటూ వాళ్ళిద్దరిమధ్యా జరిగిన సంభాషణ యధాతథంగా వివరించాడు.

నవీన్ : అరేయ్ ఈశ్వర్!

ఈశ్వర్ : అరె నవీన్! నువ్వా, ఇక్కడున్నావేమిటి?

నవీన్ : ఇక్కడ మా బాబాయి కూతురు పెళ్ళి. దానికని వచ్చాను.

ఈశ్వర్ : ఎక్కడుంటున్నావ్?

నవీన్ : చుండూరులో. ప్రశ్నలన్నీ నీవే అడగడమా - నన్నూ అడగనిస్తావా?

ఈశ్వర్ : అడుగు.

నవీన్ : నువ్వెక్కడ ఉంటున్నావ్?

ఈశ్వర్ : ఈ ఊళ్ళోనే ఉద్యోగం. ఉండేది ఈ వీధి చివర ఉన్న ఇల్లు.

నవీన్: ప్రక్క వీధిలో మా బాబాయిగారి ఇల్లు. ఫామిలీతో వచ్చాను

ఈశ్వర్ : ఇంకెన్ని రోజులుంటావిక్కడ?

నవీన్ : రేపుదయం వెళ్ళిపోదామనుకుంటున్నా.

ఈశ్వర్ : మా ఇంటికి రాకుండానే వెళ్తావా?

నవీన్ : ఇప్పుడాఫీసుకి వెళ్తున్నట్లున్నావ్‌గా, రాత్రికి వస్తాను.

ఈశ్వర్ : సారీ బ్రదర్! ఇవాళ సాయంత్రం క్యాంప్ కెళ్తున్నాను.

నవీన్ : నువ్వు లేకపోయినా మీ ఆవిడ ఉంటుంది కదా? మా ఆవిడతో నేను వచ్చి పలకరించి వెళ్తాను.

ఈశ్వర్ : ఆవిడ కూడా నాతో వస్తోంది బ్రదర్!

నవీన్ : అంటే, నువ్వు కాలేజీలో చదివే రోజుల్లో చెప్పిన మాటల్ని తు.చ. తప్పకుండా పాటిస్తున్నావన్న మాట?

ఈశ్వర్ : ఎప్పటికైనా అభిప్రాయం మారదు బ్రదర్! పాత్ర స్వరూపమునుబట్టి ద్రవ ఆకారం మారినట్లే, పరిసరాల్నిబట్టి స్త్రీ స్వభావం కూడా మారుతుంది. కాబట్టి మగవాడెప్పుడూ భార్యని కనిపెట్టుకుని తన పరిధిలోనే ఉండేలా చూసుకోవాలి. క్యాంప్‌కే కాదు నేను ఏ వూరు వెళ్ళినా తను వెంట ఉండాల్సిందే!

రాజారావు బాధపడతాడు.

"ఇతని మనస్తత్వం ఇలా ఉంటే ఆ అమాయకురాలు ఇదంతా నిజమైన ప్రేమని మురిసిపోతోంది."

"అంత జాలిపడకండి. గంతకు తగ్గబొంతే! మధ్యాహ్నం నా దగ్గరకు వచ్చింది...."

శారద చెప్పడం ప్రారంభిస్తుంది ఆవిడతో తన సంభాషణ.

శారద : ఏమిటీ! ఆయనతో పాటు మీరూ వెళ్తున్నారా క్యాంప్‌కి?

మయూరి : మీకు తెలీదు శారదగారూ! ఈ మగవాళ్ళున్నారు చూశారూ! వీళ్ళని నమ్మడానికి వీల్లేదు పెళ్ళాం పక్కన లేకపోతే ఎన్ని వెర్రి వేషాలు వేయడానికైనా వెనుకాడరు పైగా, ఈ మనిషి కొంచెం అందంగా కూడా వున్నారేమో-కనిపెట్టుకుని వుండకబోతే నాకు దక్కరు.

"సరిపోయింది, దొందూ దొందే నన్నమాట!" ఆశ్చర్యపోయాడు రాజారావు.

"అవును- ఆదర్శ దాంపత్యం!" భర్త మాటల్ని గుర్తుకు తెస్తూ వ్యంగ్యంగా అంది శారద. *

# పండగ

"రమా! ఇవాళ్టైనా మీ ఇంటి దగ్గర్నించి ఉత్తరమేమైనా వచ్చిందా?" ఆఫీసు నించి వస్తూనే అడిగాడు రామకృష్ణ.

"లేదు." ముక్తసరిగా జవాబిచ్చింది రమ.

కట్నం తీసుకుని పెళ్ళి చేసుకునే మొగవాళ్ళంటే రమకి మొదట్నించే అదో విధమైన వళ్ళుమంట. కట్నం తీసుకునేవాణ్ణి పెళ్ళిచేసుకోనని భీష్మించుకుని కూర్చుంది. రోజులు దొర్లిపోతున్నాయి. రమ ఆదర్శాని కనుగుణమైన సంబంధం ఒకటీ రాలేదు. అందుకే ఇరవై రెండు సంవత్సరాలు నిండుతున్నా కుమారి రమ శ్రీమతి రమగా మారలేదు. పైగా రమ చెల్లెలు ఉమ పద్దెనిమిది సంవత్సరాలు నిండి, మరో గుండెల మీద కుంపటిలా తయారైంది రమ తల్లితండ్రులకి.

"చూడు తల్లీ! ఆదర్శాలు వుండటం తప్పు కాదు. అవి ఫలించనప్పుడు వాటినే పట్టుకుని వేళ్ళాడటం అవివేకం ఇరవై రెండేళ్ళు నిండుతున్నా నీకింకా పెళ్ళిచేయలేదని నా వెనుక గుసగుస లాడుతూ, నన్నదో విధంగా చూస్తున్న ఈ లోకం చూపుల్ని నేను భరించలేను. ఈ రోజుల్లో కట్నమివ్వకుండా ఆడపిల్ల పెళ్ళి జరుగదు. నా తిప్పలేవో నేను పడతాను. కట్నం సంగతి నీ కనవసరం. చుండూరు వారి సంబంధం అన్నివిధాలా బాగుంది. కట్నం కూడా పెద్ద ఎక్కువేం అడగలేదు. ఈ సంబంధాన్ని వప్పుకో." ఒక రోజు రమని ప్రాధేయపడ్డారు తండ్రి నిరంజనంగారు.

రమ మాట్లాడలేదు. మళ్ళీ నిరంజనం గారే "నీ పెళ్ళి చేస్తేగాని ఉమ పెళ్ళి గురించి ఆలోచించేది లేదు. మా మాటమీద విలువవుంచి ఈ

సంబంధాన్ని అంగీకరించు" అన్నారు. తల్లి కూడా శత విధాలా పోరాటం ప్రారంభించింది.

రమ ఆలోచించింది. తీవ్రంగా ఆలోచించింది. తన ఆదర్శాలు ఇతర్లని బాధించకూడదని నిశ్చయించుకుంది. ఫలితంగా రామకృష్ణ రమ జీవిత భాగస్వామి అయ్యాడు. కట్నంకోరే మగవాడంటే వున్న అసహ్యం రమ మనసులోంచి పూర్తిగా తొలిగిపోలేదు. అందుకే కట్నం తీసుకుని తనని పెళ్ళిచేసుకున్న రామకృష్ణ అంటే ఆమెకి క్రోధం. బలవంతాన కోపాన్నణచుకుంటూ అతన్తో జీవితాన్ని సాగిస్తోంది. అయినా అప్పు డప్పుడూ ఎంత కాదనుకున్నా, అతనంటే వున్న కోపం బయటపడుతూనే వుంది. రామకృష్ణ ఈ సంగతిని పసిగట్టకపోలేదు.

గోరుచుట్టుమీద రోకటిపోటులా కట్నంతో తనని పెళ్ళి చేసు కున్నాడనే కోపంతోవున్న రమ, తమ పెళ్ళితర్వాత వచ్చే మొదటి పండగకి మామగారి దగ్గర్నించీ ఇంకా పిలుపు రాలేదని ఎదురు చూస్తున్న రామకృష్ణని చూస్తుంటే మరింత మండిపోతోంది.

"దీపావళి ఇంకా పది రోజులుకూడా లేదు పండక్కి రమ్మని ఇంతవరకూ మీ నాన్నగారి దగ్గర్నించీ ఉత్తరం రాలేదెందుకో!" బూట్ల లేసులు విప్పుకుంటూ అన్నాడు రామకృష్ణ.

"పండక్కి రమ్మని మా నాన్నగారు ఎందుకు రాయాలి?" వచ్చే కోపాన్నంతా దిగమింగుతూ అడిగింది రమ

"మన పెళ్ళయిన తర్వాత వచ్చే మొదటి పండుగ ఇది. కాబట్టి కూతుర్ని అల్లుడ్ని పండక్కి ఆహ్వానించి, బట్టలు పెట్టి పంపించాలి." నవ్వుతూ అన్నాడు రామకృష్ణ

"ఆయన పెడితేగాని మీరు బట్టలు కుట్టించుకోకూడదా? అసలే పెళ్ళికైన అప్పుల్లో తలవరకూ మునిగున్నారు."

"తలవరకూ మునిగున్నా, గొంతువరకూ మునిగున్నా పండక్కి మనల్ని పిలిపించి బట్టలు పెట్టడం మీ నాన్నగారి కర్తవ్యం."

"మా నాన్నగారే మనల్ని పండక్కి ఎందుకు పిలవాలి? మీ నాన్న గారు పండక్కి పిలిచి కోడలికి చీర పెట్టకూడదా?"

"పెట్టకూడదని ఎక్కడాలేదు. కాని, మన ఆచారం పెళ్ళైన కొత్తల్లో కూతుర్ని, అల్లుడ్ని పిలిచి, వాళ్ళకి కొత్తబట్టలు పెట్టడం. అర్థమైందా?" కోపంతో ఎరుపెక్కిన రమ ముక్కువంక చూస్తూ చిలిపిగ నవ్వాడు రామకృష్ణ.

"మానాన్నగారి దగ్గర్నించి పండక్కి రమ్మని పిలుపు వచ్చినా సరే, మనం వెళ్ళేదిలేదు." నిక్కచ్చిగా అంది రమ.

"మనం వెళ్ళేదిలేదు అనమాకు. కావాలంటే నేను వెళ్ళేదిలేదను అంతే. నేనీ దీపావళి పండక్కి మీ ఇంటికి వెళ్ళాల్సిందే, కొత్త బట్టల్తో రావల్సిందే!"

"నేను రాను, మీరు వెళ్ళటానికీ వీల్లేదు!"

"సర్లే, ముందు మీ నాన్నగారి దగ్గర్నించి వుత్తరం రానీ, తర్వాత తీరిగా పోట్లాడుకుందాం. ఆఫీసునుంచి వచ్చి అరగంటయింది. కాసిని కాఫీనీళ్ళైనా ఇస్తావా లేదా?"

రమ రుసరుస లోపలికి వెళ్ళిపోయింది.

రామకృష్ణ వచ్చే నవ్వు నాపుకుంటూ ఎదురుగుండా టేబుల్ మీద పడున్న పేపర్నందుకున్నాడు

* * *

"ఏమండీ! ఇవాళైనా ఉత్తరం రాశారా?" నిరంజనంగారు లోపలికి అడుగుపెట్టీ పెట్టకముందే అడిగారు సీతమ్మగారు.

"ఎవరికి?" చెప్పులు తలుపు పక్కన విడిచి, వాలు కుర్చీలో మేను వాలుస్తూ అడిగారు నిరంజనంగారు.

"ఎవరికేమిటండీ, రామాయణమంతా విని రాముడికి సీత ఏమైందన్నట్లు! పండగ ఇంకా పది రోజులుకూడా లేదు. చిన్నమ్మాయి పెళ్ళయిన తర్వాత వచ్చే మొదటి పండగ ఇది. పండక్కి పిలిచి అల్లుడికి గుడ్డలు పెట్టకపోతే ఎట్లా?"

"మరేమీ కొంప మునిగిపోదు ఈ పండక్కి వాళ్ళని పిలవడం ఇష్టంలేదని ఇదివరకే చెప్పాగా? చిన్నమ్మాయి పెళ్ళికి చేసిన అప్పు ఇంకా పూర్తిగా తీర్చలేదు. ఆ అప్పు తీరిన తర్వాత ఓ పండక్కి పిలుద్దాం."

"ఈ పండక్కి పిలువకుండా ఎప్పుడో పిలుస్తానంటే బాగుంటుందండీ?"

"ఎప్పుడో పిలుస్తామని వాళ్ళకి చెప్పడమెందుకు? అయినా, అప్పు చేసి పప్పుకూడు తింటే పండుగ కాదే! మనకి పరిస్థితులన్నీ అనుకూలంగా వున్నప్పుడు నల్గురూ కలసి ఆనందంగా గడిపితే అదే పండుగ. నువ్వే ఆలోచించు, ఇప్పుడు వాళ్ళని పండక్కి పిలిచామంటే కనీసం మరో రెండొందలైనా అప్పు చేయాలి. వాళ్ళొక రోజుంటారు, వెళ్ళిపోతారు. తర్వాత మనకి అప్పు తప్పిస్తే ఆనందం ఏమైనా వుంటుందా?"

"మనకి ఆనందంగా వుండదని పిల్లల అచ్చట్లు ముచ్చట్లు జరపకుండా వుంటామా?" నిరంజనంగారి మాటలకి సీతమ్మగారికి విపరీతమైన కోపం వస్తోంది. అయినా కోపాన్నంతా బలవంతాన అణచుకుని మామూలుగా మాట్లాడటానికి ప్రయత్నిస్తోంది.

"పిల్లల అచ్చట్లు ముచ్చట్లు మనం మాత్రం చూడటం లేదా? మరో నెల రోజుల్లో పెద్దమ్మాయి పురిటికి వస్తోంది. అదో ఖర్చు. చిన్నపిల్లలకి గుడ్డలు పూర్తిగా పోయాయి. వాళ్ళకు గుడ్డలు కుట్టించాలి. ఇటువంటి ఖర్చుల్లో వాళ్ళని పిలవదల్చుకోలేదు." వాలుకుర్చీలో వెనక్కివాలి కళ్ళు మూసుకున్నారు నిరంజనంగారు.

తనేం చెప్పినా వినే స్థితిలో లేరని గ్రహించి, వంటింట్లోకి వెళ్ళిపోయారు సీతమ్మగారు.

*　　　*　　　*

"గుడ్డలు సర్దావా? రేపుదయం బండికి టికెట్లు రిజర్వ్ చేసు కొచ్చాను." రమ ప్రక్కనే మరో కుర్చీలో కూర్చుంటూ అన్నాడు రామ కృష్ణ. రమ మాట్లాడలేదు కాదు, ఆమెకి మాట్లాడా లన్పించలేదు. తిరిగి రామకృష్ణే అన్నాడు:

"నేను చెప్పింది వినబడిందా? మనం రేపుదయం బండిలో మీ ఊరికి వెళ్తున్నాం."

"నేను రాను" ఖచ్చితంగా అంది రమ.

"ఏం, ఎందుకు రావు?" ప్రశ్నించాడు రామకృష్ణ.

"నే నెందుకు రానంటున్నానో మీకు తెల్సు మళ్ళీమళ్ళీ ఆ మాటలు నా నోటినుంచి చెప్పించడం అంత మంచిది కాదనుకుంటాను."

"చాలించు నీ మూర్ఖపు పట్టుదల. మీ నాన్నగా రెంతో ప్రేమతో పండక్కి రమ్మని వ్రాశారు. మనం వెళ్ళకపోతే ఆయన బాధపడరూ?"

"మీ రాయన బాధపడతారని వెళ్తున్నారా? లేకపోతే మీ స్వలాభం కోసం వెళ్తున్నారా?"

"మనం వెళ్ళిన తర్వాత ఆ విషయం నీకే తెలుస్తుంది."

"మనం వెళ్ళడంలేదు."

"మరి తీసుకొచ్చిన టికెట్లు?"

"కాన్సిల్ చేసిరండి."

"అది జరగని పని. మనం రేపు వెళ్ళి తీరాల్సిందే, ఒకవేళ రేపు గనుక మనం వెళ్ళకపోతే మళ్ళీ ఈ జన్మలో నేనుగాని నువ్వుగాని మీ ఇంటిగడప తొక్కేదిలేదు. అర్థమైందా? లే. లేచివెళ్ళి, నాక్కాసిని కాఫీ నీళ్లు ఇచ్చి, గుడ్డలు సర్దు."

కుర్చీలోంచి లేచి నిల్చుని కాల్తో కుర్చీని వెనక్కినెట్టి, చరచరా లోపలికి వెళ్ళిపోయింది రమ. ఆమె కోపాన్ని చూసి చిన్నగా నవ్వు కున్నాడు రామకృష్ణ.

*                *                *

పండక్కి కూతురు, అల్లుడు వచ్చినందుకు అమితంగా సంతోషపడి పోయారు సీతమ్మగారు. పైకి నవ్వుతూ తిరుగుతున్నా నిరంజనంగారిలో పెరిగిపోతున్న అప్పు తిరిగి తిరిగి గుర్తుకొచ్చి మానసికంగా బాధిస్తోంది. పండక్కి తమకి గుడ్డలు కుట్టించకుండా అక్కకి, బావకి గుడ్డలు తీసు కొచ్చారని వుక్రోషంగా వుంది చిన్న పిల్లలకి! రమకూడా తల్లిదండ్రులు బాధపడతారని నవ్వుతూ తిరుగుతోందేగాని, మనసులో గిల్టీ ఫీలవుతోంది.

ఎవరెట్లా ఫీలవుతున్నా పండగ వచ్చేసింది. అప్పుడే తలంటి స్నానంచేసి వచ్చిన రామకృష్ణని పిల్చి కొత్త గుడ్డలు పెట్టారు నిరంజనం గారు. ఆ గుడ్డల్నందుకుంటూ రామకృష్ణ తన చేతిలో నున్న కవర్ని మామగారికిచ్చాడు. నిరంజనంగారా కవర్ని తెరచి చూశారు. ఆయన కళ్ళు ఆశ్చర్యంతో మెరిశాయి. అన్నీ వందరూపాయల నోట్లే! అంతా అయోమయంగా అన్పించింది.

"ఈ డబ్బు ...?" సందేహంగా అడిగాడు నిరంజనంగారు.

"మీరు నాకు కట్నంగా ఇచ్చిన డబ్బు!" తాపీగా జవాబిచ్చాడు రామకృష్ణ.

"అయితే ఇప్పుడు నాకెందుకు తెచ్చిచ్చావ్?" నిరంజనంగార్లో అయోమయం పాలు పెరిగినది.

"క్షమించండి మామయ్యగారూ! కట్నం తీసుకోవడం మొదట్నించి నాకిష్టంలేదు. కానీ మా తల్లిదండ్రుల దృష్టిలో కట్నం తీసుకోకుండా పెళ్ళి చేసుకుంటే నామర్దా. ప్రస్తుతపరిస్థితుల్ని వాళ్ళకి పూర్తిగా విడమర్చి చెప్పలేను. అట్లా చెప్తే వాళ్ళ మనసుని బాధించినవాడ్నవుతాను. చిన్నప్ప ట్నించీ నన్ను ప్రాణంకన్నా మిన్నగా ప్రేమించినవాళ్ళని బాధించలేను- అలాగని కట్నం పేరుతో మరో ఆడపిల్ల తలిదండ్రుల్ని క్షోభ పెట్టలేను. అందుకని ఆ విషయమై ఆలోచించి ఒక నిర్ణయానికొచ్చాను. అప్పట్నించీ నెలనెలా నా జీతంలోంచి కొంత రికరింగ్ డిపాజిట్ లో వేస్తూ వచ్చాను.

నేను రికరింగ్ డిపాజిట్ ప్రారంభించి మూడు సంవత్సరాలు కావస్తు
న్న తరుణంలో మా వివాహం అయింది. ఈ పండక్కి నా రికరింగ్ డిపా
జిట్ మెచ్యూర్ అవుతుంది. అందుకని ఎప్పుడెప్పుడు పండుగ వస్తుందా, ఎప్పు
డు మీ డబ్బు మీకిచ్చేద్దామా అని ఇన్నాళ్ళనుంచీ ఆత్రంగా ఎదురుచూ
స్తున్నాను. దాన్ని మీ అమ్మాయి వేరుగా అర్థం చేసుకొంది" అంటూ చిలిపి
గా రమవంక చూశాడు.

రమకంతా ఆశ్చర్యంగా వుంది. ఇది నిజమా, కలా అని ఒకసా
రి చేతిని గిల్లుకుంది. చేయి చురుక్కుమంది. సీతమ్మగార్కి ఆశ్చర్యం
కూడిన ఆనందం తలమునకలా తడిపేస్తోంది.

"మీ నాన్నగార్కి కట్నం ఇచ్చినట్లు ఇచ్చి, మళ్ళీ నీ దగ్గర్నుం
చి ఆ సొమ్ము తీసుకోలేను. ఈ డబ్బు నీ దగ్గరే వుంచు బాబూ!" తన చేతిలో
వున్న కవర్ను తిరిగి రామకృష్ణ కివ్వబోతూ అన్నారు నిరంజనంగారు.

"దయచేసి నన్నర్థం చేసుకోండి. ఆ డబ్బు ఇంకా నా దగ్గరేవుం
టే మాలో కలతలు వచ్చే ప్రమాదం కూడా వుంది. మీరు గనుక ఈ డబ్బు
తీసుకోకపోతే మేం మళ్ళీ ఇక్కడికి రాము!"

"అంతమాటనకు బాబూ!ఇంతవరకూ ఇటువంటి మనుషులుంటారని
సినిమాల్లో చూడటం, కథల్లో చదవడమేగాని నిజ జీవితంలో చూడలేదు
నీలాంటి అల్లుడు మాకు దొరకడం నిజంగా మా అదృష్టం...."సంతోషంతో
నిరంజనంగారి నోటినుంచి మాటలు రావడంలేదు.

"మీరు పెట్టిన గుడ్డలు కట్టుకొస్తాను" అంటూ రామకృష్ణ పక్క
గదిలోకి వెళ్ళాడు.

ఇంతకాలం ఈ రహస్యం తన దగ్గర దాచినందుకు చిరుకోపం
ప్రదర్శించి, తనిదివరలో అన్న మాటలకి క్షమాపణలు వేడుకోవాలని భ
ర్తననుసరించింది రమ.

(అనామిక మాసపత్రిక)

S.C.114.6133
RAM
Acc.No. 23054